## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **మోహన్ పబ్లికేషన్స్** వారి వెబ్ సైట్: http://www.mohanpublications.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విజయం మీది

**(వ్యక్తిత్వవికాస విజయమాల)**

రచన
**మైత్రేయ**





ప్రకాశకులు : ☎ 246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1

 2012 వెల : 50-00

**విజయం మీది**

(వ్యక్తిత్వ వికాస విజయమాల)

ప్రథమ ముద్రణ - సెప్టెంబర్ - 1990
ద్వితీయముద్రణ - ఫిబ్రవరి - 1993
తృతీయముద్రణ - ఏప్రిల్ - 2006

రచయిత

**మైత్రేయ**

**(శ్రీగురుపద క్షేత్ర)**
**ప్లాట్‌నెం. 101, లక్ష్మి రెసిడెన్సీ**
**మారుతి నగర్, మౌలాలి, హైదరాబాద్**
**సెల్ : 94402 05180, 98851 38117**
**ఫోన్ : (040) 27134225**



ప్రకాశకులు :
**మోహన్ పబ్లికేషన్స్**
అజంతా హోటల్ ఎదురుగా, కోటగుమ్మం,
రాజమండ్రి - 533 101.



## విషయసూచిక

## 1. శ్రీవాణి

**డాక్టర్ కరుణశ్రీ**

మానవ జీవితం ఒక కురుక్షేత్రం. ఈ కురుక్షేత్రంలో అస్తికీ, నాస్తికీ, ధర్మానికీ, –అధర్మానికీ, న్యాయానికీ–అన్యాయానికీ, మంచికీ–చెడ్డకూ, నిరంతర సంగ్రామం సాగుతూనే ఉంటుంది. ఈ సంకుల సమరంలో నరుడు నిరాశతో అలిసిపోయి కర్తవ్య పరాఙ్ముఖుడైనప్పుడు నారాయణుడు నరుని వెన్ను చరిచి స్థిమిత పరచి ముందుకు నడిపించుతాడు. కర్తవ్య పరాయణుణ్ణి కావిస్తాడు. విజయం చేకూరుస్తాడు.

**"సంభవామి యుగే యుగే"** అని భగవానుడు చెప్పినట్లు సత్యధర్మ సంస్థాపనం కోసం ఆనారాయణుడే అనేక రూపాలతో బుద్ధ భగవానుడుగా ఆచార్య శంకరులుగా, రామకృష్ణ పరమహంసగా, రమణ మహర్షిగా, రామ తీర్థస్వామిగా, వివేకానందుడుగా, ఆయా సమయాలలో ఆవిర్భవించి కారు చీకట్లలో దారి తెలియక కొట్టు మిట్టాడుతున్న మానవ జాతికి ఆశాజ్యోతియై వెలుగులు వెదజల్లుతాడు. జగతికి ప్రగతిని ప్రసాదిస్తాడు. అటువంటిమహామహుల కోవకు చెందినవారే మధుసూదనానందులు వారు.

మైత్రేయ మధుసూదన సరస్వతీ స్వామి సంస్కృత, హిందీ, ఆంగ్ల భాషలలో నిష్ణాతులు. శ్రీ స్వామి చిన్మయానంద ఆశీస్సులు పుష్కలంగా లభించిన వారు ప్రస్థానత్రయం అభ్యసించి ప్రదీప చైతన్య బ్రహ్మచారిగా ప్రశస్తిగాంచి భగవద్గీత, రామాయణం, భాగవతం, ఉపనిషత్తులు మొదలైన ధర్మ గ్రంథాలను ప్రజలలో బాగా ప్రచారం చేసిన మహనీయులు.

వీరు శ్రీరామ శరణ్ కుందుర్తి వేంకటనరసయ్య మహోదయుల దగ్గర శ్రీరామమంత్ర దీక్ష అందుకున్నారు. (చిరంరరజీవులు శ్రీ నిఖిలేశ్వరానందస్వామి వారి వద్ద తంత్రం అభ్యసించారు.



మధుసూదనానంద ఇంతకు ముందు తన ఉపన్యాసాలను ఒకచోట ఏర్చి కూర్చి **"ఆధ్యాత్మిక తరంగిణి"** అనే అధ్యాత్మిక గ్రంథాన్ని ఆస్తికలోకానికి అందించారు. దీనితో బాటుగా మోహన్‌పబ్లికేషన్స్ రాజమండ్రివారిద్వారా డజనుకుపైగా తంత్రగ్రంథాలు వెలువరించారు.

ఇప్పుడు మీ కరకమలాలను అలంకరించిన గ్రంథం **"విజయం మీది?"** అనేది. ఇందులో అప్పుడప్పుడు శ్రీస్వామి వారు వ్రాసిన పదునారు వ్యాసాలు ఉన్నాయి. షోడశ కళాప్రపూర్ణమైన **"శరచ్చంద్ర చంద్రిక"** వంటి ఈ కృతి స్వామివారు భక్తుల కిచ్చిన బహూకృతి.

ఈ కృతి ఆకృతిలో ఎంత చిన్నదో జీవిత సాఫల్యాన్ని ప్రబోధించటములో అంత గొప్పది. **"మానవుడు విజయం కొరకు ఏం చెయ్యాలి"** అనే ప్రశ్నకు చక్కని సమాధాన రూపం ఈగ్రంథం. స్వామి సూక్తులు చిత్తగించండి.

"సఫలతకు మూలం దృఢ సంకల్పం. మీ దృఢమైన సంకల్పమే మీకు అక్షయశక్తి నిస్తుంది. ధైర్యం, విశ్వాసం, ఏకాగ్రత, సహిష్ణుత, త్యాగం మొదలైన గుణాలను మనం ఆదరించినప్పుడే అవి మనలో ప్రవేశిస్తాయి"

"ప్రతి క్షణం మనం ప్రసన్నులమై ఉండాలి. ప్రతి క్షణం మనం మన లక్ష్యప్రాప్తికై ప్రయత్నించాలి. ప్రతి క్షణం మన శక్తిని అనుభవంలోకి తెచ్చుకోవాలి"

"ప్రతిక్షణం నిండుగా జీవించాలి. జీవితాన్ని సఫలం చేసుకోవాలి. మనం ఏ ధర్మాన్ని కర్తవ్యాన్ని లక్ష్యాన్ని ప్రయోజనాల్ని నిశ్చయించుకుంటామో దానిని భగవంతుడిలా పవిత్రంగా భావించాలి".

"పరిశ్రమే సఫలతకు మూలం. ఏ వ్యక్తి అయితే రాత్రింబవళ్ళు తన కర్తవ్య దీక్షలో దృఢంగా నిలిచి ఉంటాడో అతడే పురోగమించి జీవిత సాఫల్యం పొందగలుగుతాడు".

"కష్టాలకు భయపడవద్దు. వాటికి ఎదురొడ్డి నిలబడటం నేర్చుకోండి. బంగారం బాగా కాగితేనేగాని స్వచ్ఛంగా తయారుకాదు. రాయి ఉలి దెబ్బలు తింటేనే అందమైన విగ్రహంగా మారేది"

"నిరాశ అన్నిటికంటే పెద్దరోగం. దానినిదగ్గరకు రానీయకండి. ఉత్సాహం నిండిన మనస్సులోకి నిరాశ ప్రవేశించలేదు."

"మనస్సును కాస్త అదుపులో పెట్టుకోండి. ఇతరులను ఎక్కిరించకండి. అవసరమైనంతే మాట్లాడండి. మనస్సులోని ఉద్రేకానికి ఆనకట్ట వేయండి".

"విజయం అదృష్టంలో లేదు. శక్తి, యుక్తి, కర్తవ్య, దీక్షలపై ఆధారపడి ఉంటుంది. గమ్యాన్ని మార్చకండి. సన్మానాల వెంట పరుగెత్తకండి. మీలో అర్హత ఉంటే అవే మీ వెంటపడి వస్తాయి"

"నిశ్చయం దృఢమైనదీ, నిర్భయమైనదీ, పవిత్రమైనదీ అయితే దానికి ఈ సృష్టిలో ఎదురులేదు. అటువంటి నిర్భయతకు విజయమేకాని కాని అపజయం సంభవించదు. ఆత్మ విశ్వాసాన్ని విడువకండి. విజయం మీదౌతుంది"

శ్రీ స్వామీజీ ఈ విధంగా ఈచిన్నపుస్తకంలో ఎన్నో సూక్తులు వెల్లడించారు. సఫలతా ప్రాప్తికి మార్గాలు ఉపదేశించారు. తమ ప్రసంగాలకు ప్రోద్బలంగా మిల్టన్, ఎమర్సన్, బ్రౌనింగ్, షేక్స్పియర్, బెర్నార్డుషా, ఆచార్య రామచంద్ర శుక్ల, మహాదేవ వర్మవంటి మహామహుల వాక్యాలను ఉదహరించారు. మదన మోహన మాళవీయ, బాలగంగాధర తిలక్, వినాయక సావర్కార్, చంద్రశేఖర ఆజాద్ వంటి దేశభక్తులు, స్వాతంత్ర్య వీరుల జీవితాలలోని సన్నివేశాలను ఉటంకించారు. అబ్రహం లింకన్ వంటి కర్తవ్య పరాయణుల జీవిత ఘట్టాలను వివరించారు. యామినీ రాయ్, రుక్మిణీ అరండేల్ వంటి కళాకారుల ఉద్దేశాలను ప్రకటించారు.

శుభాకృతి అయిన ఈ కృతి మానవులకు మార్గదర్శకం. సాధకులకు చైతన్యలహరి. పాఠకులకు పారిజాతం.

ఇటువంటి లోకోపకృతులైన కృతులు మధుసూదనానందులవారి సువర్ణ లేఖిని నుండి ఎన్నో, ఎన్నెన్నో వెలువడాలనీ జాతిని చైతన్యవంతం చెయ్యాలనీ ఆశిస్తున్నాను.

**కరుణశ్రీ**

**డాక్టర్ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు**







## 2. ముందుమాట (సెప్టెంబర్ 1990)

విజయం కొరకు ఏం చెయ్యాలి? అనే సంగతి నేను దాని కొరకు నిరంతరం ప్రయత్నిస్తున్నప్పుడు నాకు తెలియదు. జీవితంలో సాధారణంగా గోచరించే భౌతిక లేదా ఆధ్యాత్మిక మార్గాలలో వేటిలో ప్రయాణించే వారికయినా విజయం పొందాలనే ఉంటుంది. ఐనప్పటికీ చాలామంది జీవితంలో అపజయం పొందుతున్నారు. కారణం ఏమిటి? మానవులలో శక్తి, తెలివి మొదలైనవి కొరవడి కాదు! వాటిని ఎలా ప్రకటించాలో తెలియక పోవడంవల్లే! బీజంలో వృక్షమయ్యే స్తోమత లేక కాదు దానికి సరియైన అనుకూలమైన వాతావరణం సారవంతమైన భూమి లభించక కాదు! రోజూ సమయానికి కావలసినన్ని నీళ్ళు పోస్తూ అవసరమైనంత ఎరువు వేస్తూ, తెగుళ్ళు మొదలైనవి వచ్చినప్పుడు సరియైన మందు వాడగల తోటమాలి లేక ఈ బీజాలు మహావృక్షాలు కావడం లేదు.

నా వరకు నేను సరియైన మార్గం దర్శకత్వం (Guidence) లేక నా జీవితంలో ఎంతో ఇబ్బంది పడ్డాను. "డేల్ కార్నెజ్" వంటి మేధావులు, సృష్టించిన వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన పుస్తకాలు, మహాత్ముల ద్వారా సృష్టించబడ్డ "డెసెడెరట్టా, ప్రాఫెట్" లాంటి గ్రంథాలు అధ్యయనం చేసి నిత్యజీవనోపయోగానికి వినియోగించాను కానిఅటువంటి పుస్తకాలు ఉన్నాయని కూడా తగిన సమయంలో చెప్పినవారు లేకపోయారు. పనికిరాని వారపత్రికలు, నవలల్లోనే చాలా జీవితం గడిచిపోయింది. తెలుగులో మాత్రం అటువంటి పుస్తకాలను నేను ఎరుగను ఈ మధ్యే దాంపత్య జీవితం, పిల్లల పెంపకం మొదలైన జీవితోపయోగమైన కొన్ని విషయాలపైన వ్రాయబడ్డ పుస్తకాలు బైటికొస్తున్నాయి. కానీ అవి జీవితంలోని కొందరికి కొన్ని సమయాలలో గాని లేదా కొన్ని విషయాలలో జీవితాంతంగాని పనికి వచ్చేవి మాత్రమే. మొత్తం జీవితాన్నంతా ధైర్యంగా ఎదుర్కొని ముందుకు

చొచ్చుకు పోగల జవాబులు వాటిలో కూడా నాకు కనిపించడం లేదు. మొదట అటువంటి పుస్తకాలు ఆంగ్లంలో ఉన్నాయి కదా. వాటిని తెలుగులోకి అనువదిద్దామా అనే ఆలోచన వచ్చింది. కానీ ఆదేశ వాతావరణం, ఆప్రాంతం మనుషులు, వారిమనస్తత్వాలు అక్కడి సాంఘిక, రాజకీయ పరిస్థితులు, ఆచార వ్యవహారాల నాధారంగా చేసుకొని వ్రాయబడ్డ ఆ పుస్తకాలు అంతగా మనకు ఉపయోగపడవనిపించింది. అప్పుడే ఈ పుస్తకాన్ని వ్రాయడానికుపక్రమించాను.

ఈ పుస్తకం ఒక ప్రణాళిక (Plan) ప్రకారం వ్రాయబడలేదు. ఎప్పుడెప్పుడు మనస్సులోకి ఆలోచనలు వస్తే అప్పుడే దానిని కాగితంపైన పెట్టేవాణ్ణి, దీని సృష్టిలో అనేక పుస్తకాలు నాకు సహాయపడ్డ మాట వాస్తవమేకానీ, ఎక్కువభాగం నా జీవితంలో నేను వ్యక్తిగతంగా ఎదుర్కొన్న పరిస్థితులు, ఎదురైన ఇబ్బందులు, వాటిలో నుండి నేను బైటపడ్డ విధానం గుర్తుంచుకొని వాటినే సూత్రీకరించి కాగితంపైన ఉంచడానికి ప్రయత్నించాను. నేనీపుస్తకం వ్రాస్తున్నప్పుడు ఆ కాగితాలను చదివి ఒక వ్యక్తి ఆశ్చర్యంగా 'సందర్భానుసారం' విషయ వివరణకు మీరు చక్కగా హృదయానికి హత్తుకుపోయేట్టున్న ఉదాహరణలు, ప్రేరణకిచ్చే ప్రసంగాలు, గొప్పవారి అనుభవాల నుంచి, మహాత్ముల జీవితాల నుంచి సేకరించి జోడించారు. "ఇవన్నీ మీకెలా లభించాయి?" అని అడిగాడు. నేను నవ్వుతూ ఈ క్రింది కథ చెప్పాను.

ఒక ఊళ్ళో ఒక గొప్ప విలుకాడుండేవాడు ఒక్క చెక్కపైన గుండ్రంగా ఒక వృత్తం గీసి అందులో మధ్యన ఒక లక్ష్యబిందువు నేర్పరచి రోజూ దానిపై బాణాలు వదులుతూ తన విలువిద్యకు మెరుగులు దిద్దేవాడు. సరిగ్గా మధ్యలోనే బాణాలు అన్నీ తాకకపోయినా మధ్యబిందువులోనే తగులుతుండేవి. ఒకసారి ఆ విలుకాడు వేరే ఒక గ్రామానికి వెళ్ళాడు. అక్కడ ఎక్కడ గోడమీద చూసినా ఒక వృత్తం గీచి ఉండటం అందులో సరిగ్గా ఒక సెంటీమీటరు కూడా అటూ ఇటూ కాకుండా ఒక బాణం నాటబడి ఉండడం కనిపించింది. ఆయన ఆశ్చర్యంగా చూస్తూ ముందుకు సాగి ఆ అసాధారణ విలుకాణ్ణి కలిశాడు. "ఏమాత్రం అటూ ఇటూ కాకుండా ఇంత మధ్యలో ఎలా బాణం నాటగలిగావు? అని అడిగాడు. ఆవ్యక్తి నవ్వుతూ "ఈఊళ్ళో నన్ను అంతా పిచ్చివాడంటారు. ఎందుకంటే మామూలుగా ప్రజలు చేసే పనులన్నిటినీ నేను వ్యతిరేకంగా చేస్తాను. మీరు ముందు ఒక వృత్తాన్ని గీసి దాని మధ్యలో ఒకబాణం నాటుదామని చూస్తారు. నేను మాత్రం ముందు బాణం కొట్టి దాని చుట్టూ వృత్తాన్ని గీస్తాను. అందుకే అది అంత మధ్యకు వస్తుంది అన్నాడు.



నన్ను ప్రశ్నించిన వ్యక్తికి ఈ కథచెప్పి "నేనుకూడా ఒక పిచ్చివాడినే. మీరంతా విషయాన్ని వ్రాస్తూ ఉదాహరణలు వెతుక్కుంటారు, నేనేమో ఎక్కడైనా ఒక ప్రేరక ప్రసంగం (Anecdote)కనిపిస్తే చాలు దానిచుట్టూ సూత్రాన్ని అల్లుతాను. అందుకే నాఉదాహరణలు విషయంకొరకే పుట్టినట్టు ఉంటాయి. కాని సత్యానికి ఉదాహరణనుండే (వ్యక్తులజీవితాలనుండి) విషయం పుడుతుంది" అన్నాను.

ఇక పుస్తకంలోని విషయానికి వద్దాం. విజయం అంతా కోరుకుంటున్నా ఏ విషయంలో ప్రత్యేకంగా వారికి విజయం కావాలి అనే సంగతి ముందు నిర్ణయించుకోలేక పోతున్నారు. అందుకే లక్ష్య నిర్ణయం అనేది మొదటి అధ్యాయంగా నిర్ణయించాను. ఇల్లు కట్టాలని సంకల్పించిన మాత్రాన కట్టనిదే ఇల్లు సిద్ధంకాదుకదా. అందుకే నిరంతర పరిశ్రమ రెండవ అధ్యాయమైంది. నా జీవితంలో నేను ఏపని చేపట్టినా శ్రమపడి ఆపనిని పట్టుదలగా చేసేవాడ్ని. అయినా నాకు మానసిక శాంతి లభించేదికాదు. అందుకు కారణం నాకు ఆపని అప్పజెప్పిన వారిపై విశ్వాసంగానీ, చేసే పనిపైన ప్రేమగానీ ఉండేదికాదు. బ్రతుకుతెరువుగా మాత్రమే నేనా పనిని స్వీకరించేవాడ్ని కనుక మనస్సు ఆహ్లాదంగా ఉండాలంటే విశ్వాసం, ప్రేమ అవసరమని గ్రహించాను.

ఆంధ్రులు ఆరంభశూరులు అని కొందరు అంటూ ఉండటం మనకు వినిపిస్తుంది. అలాగే మన రాజకీయ నాయకులు కూడా పంచవర్ష ప్రణాళికలను నిర్ణయించడమైతే జరుగుతుందిగాని మళ్ళీ ఐదేండ్ల తరువాతగానీ ఆ ప్రణాళికలో తీసుకొన్న నిర్ణయాలలో ఎన్ని పూర్తిచేయగలిగాము అనేది ఆలోచించరు. అందుకే కాలపట్టీని (Time table) నిర్ణయించు కోవడమేకాదు. దృఢమైన చిత్తంతో దానిని అనుసరించి పూర్తిచేయాలి కూడా.

ఆ తరువాత ఐదు, ఆరు అధ్యాయాలు రెండూ ఒకటేనని చెప్పవచ్చు. సంకల్పం దృఢంగా ఉంటే ఎన్ని కష్టాలు వచ్చినా ఎదుర్కోవచ్చు! అమెరికన్ రాష్ట్రపతి అబ్రహామ్‌లింకన్ యువకుడుగా ఉన్న రోజులలో సంఘటన, ఆయన చాలా బీద కుటుంబంలో పుట్టాడు. అయినా జీవనసాఫల్య విషయంలో దృఢసంకల్పం కలవాడాయన. ఒకసారి లింకన్‌కు నదికి అవతలి తీరాన "ఓగ్‌నెంన్" అనే ఊళ్ళో ఒక గొప్ప న్యాయాధీశుడున్నాడని ఆయన వద్ద న్యాయశాస్త్రానికి సంబంధించిన గొప్ప పుస్తక సంగ్రహం ఉన్నదని తెలిసింది. అవి చలిరోజులు అయినాసరే మంచు తేలుతున్న ఆ నదిని దాటడానికి ఆయన ఉద్యుక్తుడైనాడు. ఒక చిన్న పడవను స్వయంగా నడపడం మొదలెట్టాడు. నదిలో సగందూరం వచ్చేసరికి ఒక మంచుగడ్డకు తగిలి పడవ పగిలిపోయింది. ఆ

స్థితిలో కూడా సాహసియైన లింకన్ భయపడలేదు. రక్తం గడ్డకట్టించే ఆమంచు నీటిలో ఈదుతూ ఆవలితీరానికి చేరుకున్నాడు.

ఆ సమయంలో ఆ జడ్జి ఇంట్లో సేవకుడు కూడాలేని కారణాన లింకన్ ఆయన ఇంట్లో ఉండటానికి అవకాశం లభించింది. ఆయనకు జడ్జి ఇంట్లో ఇండ్లు చిమ్మటం. ప్లేట్లు కడగడం లాంటి పనులుకూడా చేయవలసి వచ్చేది. అడవికివెళ్ళి కట్టెలు కూడా తెచ్చేవాడు. రాత్రిపూట ఆయన వద్ద ఉన్న న్యాయశాస్త్ర సంబంధ పుస్తకాలు చదివేవాడు. లింకన్ మనస్సును గ్రహించిన ఆ జడ్జి అతడికి పుస్తకాలు చదువుకునే సమయం కల్పించేవాడు. ఈ పట్టుదలే చివరకి లింకన్‌ను అమెరికా రాష్ట్రపతిని చేసింది. ఇదండి దృఢసంకల్పం కలిగినవారు కష్టాలతో యుద్ధం చేసే విధానం.

ఇక ఏడవ అధ్యాయం నిరాశనుండి బైటపడటం. ఒకసారి కొందరు ఆంగ్లేయ ఉపాధ్యాయులు వారణాసి వచ్చారు. వారు కాశీ హిందూ విశ్వ విద్యాలయం చూడాలని ఉబలాటపడ్డారు. శ్రీమదనమోహన మాలవీయ ఒక్కొక్క భవనం చూపుతూ వారికి విస్తారంగా అన్నీ వివరించడం మొదలెట్టాడు. సాయంకాలమైంది. ఇంజనీరింగ్ విభాగానికి చెందిన ఒక భవనం మాత్రం చూడడం మిగిలింది. మాలవీయగారు ఏదో సభకు వెళ్ళవలసి ఉన్నది. అందుకే ఆయన ప్రొఫెసర్ టి.ఆర్.శేషాద్రిగారిని పిలిచి ఆంగ్లేయులకు ఇంజనీరింగ్ విభాగం చూపమని చెప్పారు.

"ఇప్పుడు సాయంకాలమైంది. కాలేజి పూర్తిగా మూసేశారు." అని శేషాద్రిగారన్నారు. మాలవీయ నవ్వుతూ "పోనీయండి ఎవరన్నా చెప్రాసీ అన్నా ఉంటాడుగా. అతడి సహాయం తీసుకోండి" అన్నాడు.

శేషాద్రిగారు ముఖంలో సంశయ చిహ్నాలు ఉట్టిపడుతుండగా "బహుశ అక్కడ చెప్రాసీ కూడా ఎవరూ ఉండరేమో" అన్నాడు.

అయినా మాలవీయగారు పట్టుదల విడవక నవ్వుతూ "పోనీ వీరు కిటికీ చువ్వలగుండా లేదా తలుపు సందులగుండా నైనా తొంగిచూస్తారు లెండి అన్నాడు.

వీరిద్దరి సంభాషణ వింటున్న ఆంగ్లేయులలో ఒకరు "ఇప్పుడు నాకర్థమైంది. నిరాశకు చోటివ్వని మీ మనస్తత్వమే. ఇంత పెద్ద విశ్వవిద్యాలయ స్థాపనకు తోడ్పడింది." అన్నారు.

కనుక విజయం కావాలంటే నిరాశ నుండి బైటపడాలి.



ఎనిమిదవ అధ్యాయం అవసరమైనంతే మాట్లాడటం. కాలిన్ కూలిజ్ అమెరికా సంయుక్త రాష్ట్రాలకు (U.S.A) మూడవ రాష్ట్రపతిగా ఎన్నుకోబడ్డాడు. ప్లీమత్‌లో 1872 జూలై 4న ఆయన జన్మించాడు. ఆయన పాలనకాలంలో అమెరికా సమృద్ధిని చవిచూచింది.

కూలిజ్ తన జీవితమంతా అంతర్ముఖుడుగా గడిపాడు. ఆయన చాలా మితభాషి.

ఒకసారి ఆయన భార్యాసమేతంగా చర్చికి వెళ్ళాడు. అక్కడి నుండి వచ్చేటప్పుడు ఆయన భార్య భర్త మౌనాన్ని భరించలేక మౌనభంగం చేయదలచి "ఈరోజు ఫాదర్ ఉపన్యాసం విన్నారా?" అన్నది. ఆయన "ఆ!" అన్నాడు.

ఆవిడ మహామొండిది. అందుకే ఆయనతో మాట్లాడించదలచి "అయితే ఆ ప్రసంగం యొక్క సారమేమిటో చెప్పండి" అన్నది.

ఆయన చిరునవ్వు నవ్వుతూ సంక్షిప్తంగా "పాపం!" అన్నాడు

ఆవిడ కూడా పట్టువదలక "అలా కాదు దాని విషయంలో ఆయన విస్తారంగా ఏం చెప్పారో వివరించండి" అన్నది.

ఆయన శాంతంగా "ఆయన దానిని (పాపాన్ని) వ్యతిరేకిస్తూ మాట్లాడాడు" అన్నాడు.

అనవసరంగా మనం చాలా మాట్లాడుతూ ఉంటాము. అందువల్లే సఫలత పొందలేము.

ఇలా ముందుకు సాగిన ఈ గ్రంథంలో వ్యాసాలు ఒకదానితో ఒకటి సంబంధం కలిగిఉంటుందని మాత్రం అనుకోకండి. ప్రత్యేకంగాఅవన్నీ తన వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటాయి. ఇంతకన్నా ముందుకు వెళితే గ్రంథంకన్నా ఉపోద్ఘాతం సుదీర్ఘమవుతుందని భావించి తప్పుకుంటాను.

నేను కొన్ని శబ్దాలు వాడుకలో లేనివి ఉపయోగించాను. అవ్యక్తమై నా భావం ప్రకటించడానికి ఇంతకన్నా మార్గంకనపడలేదు. అసలు ఉన్న భావంకూడా మాయమైందేమో మరి తెలియదు. క్షమించండి.

-మైత్రేయ



## 3. ముందుమాట (ఫిబ్రవరి-1993)

శాస్త్ర పరిశోధనలో రెండు ప్రధానమైన విభాగాలున్నాయి. ఒకటి మౌలిక పరిశోధన (Fundamental Research), రెండవది అనువర్తిత పరిశోధన (Applied Research) మొదటిదానిలో నూతన విషయాలు కనుక్కోవడం, నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించడం జరిగితే, రెండవదానిలో వీటిని నిత్యజీవితంలో మానవుడికి ఉపకరించే రీతిలో యంత్రాలను, వస్తువులను, మందులను తయారు చేసే విధానం కనుక్కోబడుతుంది.

విద్యుచ్ఛక్తిని కనుక్కోవడం చాలా గొప్ప విషయమే కాని ఫ్యాన్‌లు, కూలర్లు, బల్బులు, హీటర్లు, కరెంటు మోటార్లు మొదలైన వాటిద్వారా దానిని ఉపయోగించుకునే విధానాలను కనుక్కున్నప్పుడే సాధారణ మానవుడు దాని గొప్పతనాన్ని గుర్తించగలిగాడు.

జీవన సత్యాల విషయంలో కూడా అదే జరుగుతోంది. **"విజయంమీది"** పుస్తకం చదివిన ఒక స్వామివారు మీరు కొత్తగా ఇందులో వ్రాసినదేముంది? ఇదంతా భగవద్గీతలోనే ఉందికదా! అన్నాడు. నిజమే ఆ స్వామివారు చెప్పినదాంట్లో ఏ మాత్రం అసత్యంలేదు; నేను కొత్తగా ఈ పుస్తకంలో వ్రాసినదేమీలేదు. దీని మౌలిక సూత్రాలన్నీ భగవద్గీతలో ఉన్నాయి. కానీ అలనాడు విల్లు బాణాలు పుచ్చుకొని రథంమీద నిలిచిన అర్జునుడికి, సంస్కృతంలో కృష్ణుడు చెప్పిందేమిటో, ఫ్యాంటు షర్టు వేసుకొని సైకిల్ మోటారు నడిపే నేటి విద్యార్థికి ఎలా అర్థమౌతుంది? నేటి కాలమాన పరిస్థితులనుబట్టి అవే శాశ్వత మౌలిక సత్యాలను కొత్తశైలిలో వివరించ గలిగినప్పుడే ప్రజలు వాటిని స్వీకరించగలరు. అలా ప్రజాదరణ పొందిన పుస్తకమే ఈ **"విజయంమీది"** అందుకే అతి కొద్దికాలంలో మళ్ళీ రెండవ ముద్రణకు వెళుతోంది.



విజయం పొందుదామని పురుషుడు ప్రయత్నిస్తాడేగాని, స్త్రీ ప్రయత్నించదు. ఆవిడ విషయంలో విజయం యొక్క అర్థమే మారుతుంది. తాను ఉన్న సహజస్థితినే ఆవిడ విజయవంతమైనదిగా భావిస్తుంది. దీనియొక్క పూర్తివివరణ స్వామివారి "నిష్క్రియాయోగం"లో చదవండి. శాంతం, ప్రేమ, ఆవిడ స్వభావం. ప్రయత్నం వల్ల శాంతం, ప్రేమ లభింపవు. ఇవి లభించినవారికి సంతుష్టి ఉంటుంది. కనుక ఇకవారు విజయం కొరకు ప్రయత్నించరు. శాంతిలేనివాడే దేనికొరకైనా ప్రయత్నిస్తాడు. తక్కిన ప్రాణులన్నింటితో పోల్చుకున్నప్పుడు మనుష్య శిశువు చాలా బలహీనుడు. వాడు తనకాళ్ళమీద తాను నిలబడటానికి ఎన్నో సంవత్సరాలు పడుతుంది. కొన్ని జంతువుల సంతానం కొన్ని గంటలలోనే నడవ గలుగుతాయి. వాటికి తమ ఆహారం సంపాదించుకోవడానికి, లేచినడవడానికిప్రయత్నం అవసరంలేదు, ప్రకృతి సిద్ధంగా అదంతా జరిగిపోతుంది. అలాగే ఏదైనా క్రూర మృగంతో తలపడాలంటే మనిషికి ఆయుధం కావాలి. స్వతహాగా ప్రకృతి ఇచ్చిన కోరలుగానీ, గోళ్ళుగానీ వాడికి లేవు. తనలోని ఈలోపం పూర్తిచేసుకోవడం కొరకే మనిషికి ప్రయత్నం అవసరమైంది. అక్కడే విజయ కాంక్ష ప్రారంభమైంది. ఈరోజు ప్రయత్నం చేతనే మొత్తం ప్రపంచంలోని అన్ని ప్రాణులమీద అతడు ఆధిపత్యం వహించడంలో సఫలుడైనాడు.

కాబట్టి సృష్టిలో కేవలం మనుషులకు, అందులోనూ పురుషులకే (సఫలతా కాంక్ష గల వారంతా స్త్రీలైనప్పటికీ పురుషులే విజయం కావాలి. అందుకొరకు ప్రయత్నం అవసరం.ఆ ప్రయత్నంలో ఏవి అవసరమో, ఎలాచేస్తే దాన్ని పొందగలమో ఈ పుస్తకంలో వివరించాము పురోగమించండి

**-మైత్రేయ**



ధైర్యం నశించినప్పుడు సర్వం నశిస్తుంది
**- గోథే**

## 4. ముందుమాట (ఫిబ్రవరి-2006)

మనిషి పుస్తకాలనుండి, ఇతరుల సలహాలనుండి కాక తన నిత్య అనుభవం నుండే ఎక్కువ నేర్చుకుంటాడు అనే విషయం సత్యం. ఈగ్రంథంలోని చాలా విషయాలు నా అనుభవంలోనుండే వ్రాశాను. కానీ ఇది నేనువ్రాసి ఇప్పటికి 15 సంవత్సరాలు గడిచిపోయాయి. ఈగ్రంథంనేను నా 32 సంవత్సరముల వయసులో వ్రాశాను. నాకిప్పుడు 47 సంవత్సరాలు. శరీరం పటుత్వం తప్పు తున్నది. ఆలోచనలు పూర్వమంత వేగంగాను తీక్షణంగాను సాగటంలేదు. ఈ వయసులో కూడా ఈ సూత్రాలను ఇంతే నిక్కచ్చిగా పాటించగలనా? అని నన్నునేను ప్రశ్నించుకున్నప్పుడు ఈ గ్రంథంరాసినతరువాత నేనువ్రాసిన **"ఆనందంమీది"** అనే గ్రంథం గుర్తుకువచ్చింది. అందులో నేను వ్రాసిన **వృద్ధాప్యం శాపంకాదు** అనే వ్యాసం గుర్తుకువచ్చింది. కానీ ఈ15 సంవత్సరాలలో నాకు కలిగిన అనుభవం సంగతి ఏమిటి? సూత్రాలుతయారుచేయడం, నీతులుచెప్పడం, పుస్తకాలువ్రాసి పేరుతెచ్చుకోవడం సులభము, కాని వాటిని ఆచరించడం మాత్రం కష్టం. నేను స్వయంగావ్రాసిన ఈసూత్రాలను ఎప్పుడు ఎప్పుడు జీవితంలో దాటానో అప్పుడప్పుడు నాకు ఇబ్బందులు ఎదురయ్యాయి. కాబట్టి ఈ గ్రంథంలో రాసిన సూత్రాలు తథ్యమని, వీటిని అనుసరించడం శ్రేయోదాయకమని, లేదా నానా అగచాట్లు పడవలసి వస్తుందని సవినయంగా పాఠకులోకాని తెలియజేసు కుంటున్నాను.

**"విజయాన్ని ఎలా సాధించగలమో ఓటమి బోధిస్తుంది."** అనే జార్జి డిమెట్రాన్ సూక్తి అక్షరాలా నిజం. బొప్పికట్టిన బట్టతలతో నా అనుభవాలను వ్యక్తిత్వవికాస విజయమాలలో **విజయంమీది, కలిసిజీవిద్దాం, ఆనందంమీది, శరీరభాష** పేరుగల పుస్తకాలలో మళ్ళీ అందిస్తున్నాను. స్వీకరించండి.

**05-03-06 ఆదివారం** — **మైత్రేయ**

**శ్రీ పార్థివ ఫాల్గుణ శుద్ధ షష్ఠి** — **రాజమండ్రి**



## 5. లక్ష్య నిర్ణయం

**"ఒక ప్రత్యేక కార్యసాఫల్యం కొరకు, కావలసిన శక్తి యుక్తులను కలిగి పుట్టడమే గొప్ప సంపద. ఆ గమ్యం చేరుకోవడంలోనే మనిషికి ఆనందం"**

**- ఎమర్సన్**

మీరేమి కోరుకుంటున్నారు? ఏమౌదా మనుకుంటున్నారు? ఏపని చేపడితే మీరు ఇతరుల కన్నా బాగా చేయగలరు? ఏ వృత్తి మీకు వర్తిస్తుంది? ఏ ఉత్తరదాయిత్వం మీ కొరకు ఎదురు చూస్తున్నది? ముందు ఈ విషయాలు తెలుసుకోండి. ఏ పనిలో మీరు మీయొక్క వ్యక్తిత్వాన్ని శక్తియుక్తులను సంపూర్ణంగా వినియోగించగలరు? ఏపనిలో మీమనస్సు బాగా రమిస్తుంది? దేనిద్వారా మీరు మీ వికాసాన్ని చూడటమే కాక సమాజానికి కూడా ఉపకరిస్తారు? ఈ లక్షణాలన్నీ ఉన్నపనే, మీ జీవిత లక్ష్యానికి తోడ్పడుతుందని గ్రహించండి.

లక్ష్యాన్ని నిశ్చయించుకుంటే చాలు. అది మిమ్మల్ని తనవైపు లాక్కోగలుగు తుంది. లక్ష్యంలో ఆశక్తివుంది. మీ మనస్సు మీ లక్ష్యంపైన ఉంటే చాలు మీ పురోగమనం తథ్యం.

లక్ష్యమే మనిషికి ప్రాణం, అదే జీవనం, అక్కడి నుండే మనిషికి ప్రేరణ లభిస్తుంది. కష్టాలను ఎదుర్కొనే సాహసం, బలం కూడా అక్కడి నుండే లభిస్తుంది.

మీ దృష్టి మీ లక్ష్యంపైనే ఉంటుంది. దానిని పొందటంపైనే ఉంటుంది. కనుక మీరు నిరంతరం దానివైపు ప్రయాణిస్తారు. ఇక అప్పుడు మీ జీవితం ఉత్సాహ ఉల్లాసాలతో నిండిపోతుంది. మీరు లక్ష్య ప్రాప్తి యొక్క ఆశలో నిరంతరం ప్రసన్నులై ఉంటారు.

లక్ష్యాన్ని నిర్ణయించే ముందు అది సమాజ సేవాపూరిత మయ్యేదిగా ఉండేటట్లు చూడండి. పరమార్థ దృష్టితో చేసే కర్మ, కేవలం స్వార్థదృష్టితో చేసే కర్మకన్నా ఎన్నోరెట్లు అధిక శాంతినిస్తుంది. సేవాక్షేత్రం అత్యంత విశాలం, దానిలో సంకీర్ణతలేదు. దానికి అంతంలేదు. అది ఒక ఆదర్శం. దాని ప్రాప్తి కోసం మీజీవితాలు ఉత్సాహంతో నిండిఉండాలి. అన్నీ మరిచిసేవలో రమించే వాడే సదాసుఖి.

లక్ష్యం ఎంత గొప్పదయితే అంతగా సాధన అవసరం. దేనిలోనైతే అధిక శ్రమ అవసరమో, దాని ప్రాప్తిలో కూడా అంతే ఆనందం లభిస్తుంది. మీ ముందు చిన్న చిన్న లక్ష్యాలను పెట్టుకున్నారా? ఇకమీరు బద్ధకస్తులు కాగలరు. మీ గమ్యం ఎంత గొప్పదయితే అంత దూరంలో ఉంటుంది. అదిఎంత దూరంలో ఉంటే మీరు అంత సావధానులు (Alert) అవుతారు.

గొప్పలక్ష్యం, ఉద్దేశ్యం లేదా ఆదర్శం యొక్క ప్రాప్తిలో చిన్నచిన్న విషయాలను కూడా పట్టించుకోవాలి. ఎందుకంటే ఇవన్నీ ఆ మహా లక్ష్యాన్ని పొందటానికి మెట్లు.ఒకవేళ మీ లక్ష్యం మీకు అనుకూలమైతే, నిశ్చయంగా మీరు ఉన్నత సోధాలను, చేరుకోగలరు. ప్రస్తుతం సంసారంలో మీపై ఉన్న వ్యక్తిత్వ ముద్రను కడిగివేసుకోగలరు.

కానీ ప్రస్తుతం యువతలో ఒక విచిత్రమైన స్థితి కనిపిస్తున్నది. వారి గమ్యమేమిటో వారికే తెలియదు. గొఱ్ఱెదాటుగా ఎక్కువ మంది ఏ విషయం వైపు పరిగెడుతుంటే యువత కూడా అలాగే పరిగెడుతున్నారు. ప్రస్తుతం అంతా కంప్యూటరైజేషన్ అంటున్నారు. కనుక వారు కూడా ఆయా కోర్సులలో చేరుతున్నారు. లేదా దేనిలో ఉద్యోగ అవకాశాలు ఉంటాయో చూసి వాటిలో చేరుతున్నారు. లేదా తల్లిదండ్రులకు తమ కుమారుడిని ఒక డాక్టరుగానో లేక ఒక ఇంజనీరుగానో చూడ దలచుకున్నారు. గనుక వారు తనయుణ్ణి అలా ఆజ్ఞాపిస్తున్నారు. మీకు ఇష్టంలేని పదార్థం ఎంత గొప్పదయితే మాత్రం మీరు తినగలరా? సంగీత సంస్కారం ఉన్నవ్యక్తిని బలవంతంగా డాక్టరును చేస్తే, స్టెతస్కోపును గుండెలమీద పెడతాడా లేక ఒక బల్లపై తబలా కొట్టడానికి ఉపయోగిస్తాడా?

ప్రకృతి సౌందర్యంలో తనువు పులకరించి దానిని చిత్రాలలో బంధించ డానికి ఉవ్విళ్ళూరేవాడు. కప్పలను, ఎలకలను కోయగలడా? నటకుడు రాజకీయ నాయకుడైతే అలవాటు చొప్పున నటిస్తాడే కాని ప్రజాసేవ చేయగలడా? ఇక కొందరు లక్ష్యంలో రుచి ఉన్నా అనుసరించలేమేమో అనుకొని భయపడేవారు కూడా ఉంటారు. డాక్టరునైతే ప్రాక్టీసు చేయాల్సివస్తుందని, టీచరునైతే చెప్పడమే కనుక అది సులభమని భావించి, టీచర్లయ్యే వారిని ఏమనాలి? ఏదైనా పరిశ్రమ లేనిదే పొందలేము. కనుక....

> **విజయాన్ని ఎలా సాధించగలమో ఓటమి బోధిస్తుంది**
> **- బార్జ్ డిమిట్రావ్**



## 6. నిరంతర పరిశ్రమ

**"నిరంతర పరిశ్రమ, సాహసాలే సఫలతకు మూలం**

**- సామ్యూల్ స్మయిల్**

లక్ష్యాన్ని నిశ్చయించుకున్న తర్వాత దాని ప్రాప్తి కొరకు చిత్తాన్ని ఏకాగ్రం చేయాలి. అన్నీ మరచిపోయి లక్ష్యసిద్ధి కొరకు ప్రయత్నించాలి. ఏ మహాకార్యమూ ఒక్కరోజులో పూర్తికాలేదు. "రోమ్ నగరం ఒక్కరోజులో కట్టబడలేదు" అన్న సామెత మీకు తెలుసుకదా! సమస్త అన్వేషణలు, పరిశోధనలు, ఏకాగ్రత యొక్క ఫలితాలే. చరిత్ర, భూగోళం, విజ్ఞానం, విశాల సాహిత్యం అన్నీ కూడా మనుష్యుడి యొక్క అనవరత పరిశ్రమ యొక్క ఫలితమే గుర్తుంచుకోండి.....

**"ఏకహి సాథె సబసథె, సబసాథె, సబజాయి"**

ఒకే చిత్తవృత్తిని నిలపండి. మీ మార్గంలోనె నడవండి.

పనిలో నీచోన్నతాలనేవి లేవు. ప్రతి పనిలోనూ గొప్పతనం దాగి వున్నది. ప్రతిపనిలోనూ మనం ఉన్నతిని పొందవచ్చు. శౌచాలయాలు శుభ్రంచేసి గాంధీ మహాత్ముడు కాలేదా? కనుక మీరు ఏకార్యం చేపట్టినా, మనస్ఫూర్తిగా స్వీకరించండి. దీనిని నేను సాధ్యమైనంత అందంగా తీర్చిదిద్దుతాను అని నిశ్చయించుకొని ఆ పనిని మొదలు పెట్టండి.

లక్ష్యాన్ని నిశ్చయించుకోవడం సులభం, కానీ దానిని నిరంతరం స్మరిస్తూ దాని ప్రాప్తికొరకు ప్రయత్నించడం కఠినం. మీరు మార్గంలో నడవడం మొదలు పెట్టినప్పుడే అది ఎంత కఠినమో అర్థమౌతుంది. కానీ, మీరు కఠినతల ముందు తలవొగ్గవద్దు, ఓటమిని ఒప్పుకోవద్దు. ఆ కఠినతను పట్టించుకోవద్దు. అప్పుడే మీరు ముందుకు పురోగమించగలరు.

ఎక్కడైతే కఠినత ఉందో అక్కడే పౌరుషం అవసరం. ఎక్కడ పౌరుషం ఉందో అక్కడే విజయంఉంది. పురుషార్థికి అంతా సులభమే.

పరిశ్రమే విజయానికి మూలం. గుఱ్ఱంలా పనిచేయడం సాధువులా జీవించడం నేర్చుకో. మరణించనిదే ఎవడూ స్వర్గం చూడలేడు. ఏ వ్యక్తిఅయితే రాత్రింబవళ్ళు తన కర్తవ్య కర్మలో నిలిచి ఉంటాడో వాడే ముందుకు పురోగమించ గలడు. జీవితంలో సాఫల్యాన్ని పొందిన ఏ మహాత్ముడి యొక్క జీవితాన్ని తరచి చూచినా కనిపించేదొకటే. అతడు తన జీవితంలోని ప్రతిక్షణాన్ని సదుపయోగం చేశాడు. విజయంకొరకు కఠిన పరిశ్రమను మించిన మార్గం ఏదిలేదు. చేసే కర్మపైని గౌరవమే అన్ని అపజయము దూరం చేస్తుంది.

నిరంతర పరిశ్రమ అంటే అర్థం ఏమిటంటే,వైఫల్యం ఎదురైనా నిరాశ చెందక పోవడం, మళ్ళీ మళ్ళీ విజయం కొరకు ప్రయత్నించడం. నిరంతర పరిశ్రమే నా విజయాలకు కారణం అంటాడు ఎడిసన్. నిరాశ నిస్పృహ అన్న పదాలకు అర్థం తెలియనివాడే తన లక్ష్యాన్ని చేరగలుగుతాడు. నిజానికి లక్ష్యంవైపు ప్రయాణించే వ్యక్తికి నిరాశ కలిగే ప్రసక్తేలేదు. ఎందుకంటే అతడి దృష్టి సాధించిన దానిపై లేదా పోగొట్టుకున్న దానిపై ఉండదు. అతడి ధ్యానం అంతా కర్తవ్యపాలనపై ఉంటుంది.



ప్రజలంతా బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటున్నప్పుడు కర్మశీలుడు పనిలో ఉంటాడు.

**"యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ"**

సాధారణ పురుషుడికి ఏదైతే రాత్రో సంయమి (కర్మయోగి)కి అదే కర్తవ్యకర్మకు అనుకూలమైన కాలం.

తన కర్తవ్యంలో మనస్సుని లీనం చేసినవాడు ప్రసన్నుడౌతాడు. ఎందుకంటే అన్నిటికంటే ఎక్కువ ప్రసన్నత కార్యం సంపన్నమైనప్పుడే కలుగుతుంది. ఏదో కొంత చేసేవాడికే ప్రసన్నత.

ఉత్తమ గుణ వికాసము, మనుష్య వ్యక్తిత్వ వికాసము,అనేవి నిరంతర పరిశ్రమ సంభవం. సమాజంలో మనస్థాయి పలాయనం పైన ఆధారపడి ఉండదు. కర్మనిరతిపైనే ఆధారపడి ఉంటుంది. కర్మచేసేవాడి ముందుకే



వ్యవహారిక సమస్యలు వస్తాయి. సమస్యలు ఎదురైనప్పుడే వాటికి సమాధానాలు వెతకడం జరుగుతుంది.

> **ఒక జాతిని అదివున్న స్థితినుంచి అది ఉండవలసిన స్థితికి మార్చగలిగిన వాడే నిజమైన రాజనీతిజ్ఞుడు** **–డబ్యూ. ఆర్. ఆల్జర్.**

## 7. ప్రేమ విశ్వాసాలతో చేయండి

**"స్వశక్తి పై విశ్వాసంలోనే బలం ఉంది"**

**– బోవీ**

విశ్వాసమే బలం. తనకు తెలిసినంత వరకు తనపై తాను పూర్తి నమ్మకం పెట్టుకున్నవాడికి సంసారంలో అసంభవమైన విషయమే లేదు" – అంటాడు 'జేమ్స్ ఎలన్'. విశ్వాసమే మూలశక్తి, ఎవరికైతే తన వ్యక్తిత్వంలో విశ్వాసం, శక్తిలో విశ్వాసం, విజయంలో విశ్వాసం, శీలంపై విశ్వాసం, తన సాధనపై విశ్వాసం ఉంటుందో, అతడిలోనే ఆత్మబలం ఉంటుంది.

జీవితంపై ప్రేమ, సేవాభావంపై ప్రేమ, మానవతపై ప్రేమ, శీలంపై ప్రేమ, సద్వ్యవహారంపై ప్రేమ ఉంటేనే మనం ఉదారులం, సహనశీలురం, శీలవంతులం కాగలుగుతాము. మన ఆశయాలపై మనకున్న ప్రేమే మన సచ్చరిత్రకు మూలం.

నార్వేకిచెందిన సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి సిగ్రిడ్‌అన్‌సెట్‌కు నోబుల్ బహుమతి లభించింది. ఎప్పుడైతే ఆవిడకు నోబుల్ బహుమతి లభించిందని ప్రకటించబడిందో ఆవిడను అభినందించడానికి అనేకమంది పాత్రికేయులు ఆవిడ ఇంటికి వచ్చారు. డ్రాయింగ్ రూములో కూర్చుని ఉన్నవారి వద్దకు ఆవిడ వచ్చి ఇలా అంది. "ఈరాత్రి సమయంలో మీరు ఇక్కడికి రావడానికి కారణం నేను ఎరుగుదును. ఇప్పుడే టెలిగ్రామ్ ద్వారా నాకు నోబుల్ బహుమతి లభించిందని తెలిసింది. మీ అభిమానానికి కృతజ్ఞురాలిని. కాని ప్రస్తుతం నేను మీతో మాట్లాడ లేను. కనుక దయచేసి మీరు ఇంకొకసారి ఎప్పుడైనారండి". వారంతా ఏక స్వరంతో 'ఇలా మమ్మల్ని మళ్ళీ రమ్మనడానికి కారణం తెలుసుకోవచ్చా!" అన్నారు. ఆవిడ అంది " నాపిల్లలకు భోజనం పెట్టి ఇప్పుడే నిద్రబుచ్చుతున్నాను. ఇది వాళ్ళు నిద్రించే సమయం. నాకు నోబుల్ బహుమతి వచ్చిన విషయం ఆనందాన్ని కలిగించినా అంతకన్నా ఎక్కువ ఆనందం నా పిల్లల్ని లాలించడంలోనూ వాళ్ళ అవసరాలు చూడటంలోనూ నాకు కలుగుతుంది."

ఇదే మాతృమూర్తికి బాధ్యతాయుతంగా తన పిల్లల యొక్క అవసరాలు చూడటంపై గల ప్రేమ.



డాక్టరుకు రోగియొక్క సేవలో ప్రేమ ఉండాలి. వకీలుకు న్యాయ విజయంపై ప్రేమ ఉండాలి. అధ్యాపకుడికి విద్యార్థిని జ్ఞానవంతుడిగా తీర్చిదిద్దడంలో ప్రేమ ఉండాలి. అలా స్వీకృతవృత్తిపై ప్రేమ ఉన్నప్పుడే నిజంగా వ్యక్తి పరిశ్రమించగలడు.

మనం ఏ ధర్మాన్ని కర్తవ్యాన్ని లక్ష్యాన్ని, లేదా ప్రయోజనాన్ని నిశ్చయించు కుంటామో దానిని భగవంతుడిలా పవిత్రంగా ఎంచాలి.

లక్ష్యంలో మనకు ప్రేమ దృఢమై ఉన్నంతవరకు ప్రపంచంలోని ఏ కఠిన పరిస్థితీ మనకు గమ్యం నుండి దూరంచేయలేదు. నిజమైన ప్రేమ, అచంచల విశ్వాసం, ఏకాగ్రచిత్తంలేనిదే జ్ఞానతృష్ణ సంతుష్టి చెందదు. ఎవరికైతే తమ ధర్మంలో విశ్వాసం ఉందో వాడే సుఖి. సుఖం విశ్వాసం నుండి లభిస్తుంది. తర్కంకొద్ది దూరమే మిమ్మల్ని తీసుకు వెళ్ళగలుగుతుంది. కానీ చేసేపనితో, దృఢత్వం కావాలంటే ధ్యేయంలో విశ్వాసం అనివార్యం.



ఎక్కడైతే ప్రేమ-విశ్వాసం ఉందో, ఎక్కడైతే మనస్సు లగ్నమౌతుందో అక్కడే శక్తి ఉంది. అక్కడే సఫలత నిశ్చితమై ఉంది. విజయం ధనం. వస్తువులు చేర్చడంవల్ల లభించదు. అది దృఢసంకల్ప శక్తిలోను, వ్యక్తియొక్క కర్మ తత్పరత లోను, అతని మానసిక ఏకాగ్రతలోను దాగివుంది. అక్కడే అతని శీలం మచ్చలేని దౌతుంది. నిజానికి అదే సఫలత.

భగవంతుడిలో విశ్వాసం ఉంచినవాడు, ఇష్టదైవంలో నమ్మకముంచిన వాడు, సంకట పరిస్థితుల్లో ఇదంతా భగవంతుడి కృపగా భావించి దానిని భరిస్తాడు. వాడి విషయంలో అసలు దుఃఖమే లేదు. వాడిలో అలసటలేదు. కష్టంలేదు, నిరాశలేదు. 'భగవంతుడున్నాడు' అన్న విశ్వాసం అతని విపత్తులన్నింటిని దూరం చేస్తుంది. అతడికే జీవితంలోని పొడుపు కథలన్నింటికి జవాబు లభిస్తుంది. నీకు సుఖాలిచ్చే అధికారం ఆయనకు ఉన్నప్పుడు కష్టాలిచ్చే హక్కు మాత్రం లేదా? పిల్లవాడి పుండును తుడిచి మందువేసి కట్టుకడుతున్న తల్లి ఆ పసివాడికి క్రూరురాలిగానూ, శత్రువులాగానూ, కనపడవచ్చునేమోగాని నిజానికి అదంతా వాడి మంచిని కోరే ఆ తల్లి చేసింది. ఆ విషయం మానసికంగా ఎదిగిన వారికే తెలుస్తుంది. వారినే భక్తులంటారు.

> **దేశం నీకేమి ఇచ్చిందని ఆలోచించకు**
> **దేశానికి నేనేమి ఇవ్వగలనని ఆలోచించు**
> **– జాన్ ఎఫ్. కెనడీ**

## 8. ప్రణాళికను పూర్తిచేయి

**"ఈ రోజును సరదాగా తిరగడానికి ఉపయోగించావా! రేపుకూడా అదే అవుతుంది. చివరికి భరించలేనంత బద్ధకం"**

**- షేక్స్పియర్**

వర్తమానాన్ని మించిన ఉత్తమక్షణం, అంతకన్నా గొప్పశక్తి ఏదీ లేదంటాడు ఒక మహానుభావుడు.

జీవించడం నేర్చుకున్న మానవుడే సుఖి. ప్రతిక్షణం మనం ప్రసన్నులమై ఉండాలి. ప్రతిక్షణం మనం మన లక్ష్యప్రాప్తికై ప్రయత్నించాలి. ప్రతిక్షణం మనశక్తిని అనుభవానికి తెచ్చుకోవాలి. ప్రతిక్షణం నిండుగా జీవించాలి. జీవితాన్ని సఫలం చేయాలి. ఇదే జీవనకళ. మన ఈ వర్తమాన క్షణం సఫలమైతే భవిష్యత్తు కూడా సఫలమే. సమయమనే నదిలో ప్రతిక్షణం ఒక అలలాంటిది. ప్రతి అల రెండవతరంగంతో సంబంధం కలిగి ఉంటుంది. మొదటిది ముందుకు వెళితే వెనుకనున్న అలకు అప్రయత్నంగా వేగం పెరుగుతుంది. మీరు చేయవలసిన పని ఆక్షణంలో చేసినా చేయక పోయినా ఆ క్షణం (కాలం) మాత్రం ఆగదు. జీవితంలో ఇక మీరు దానిని మళ్ళీ అందుకోలేరు కూడ. అందుకే ప్రతి అలకు ప్రాముఖ్యత నివ్వండి. దానిని ఉపయోగించుకోండి. ఒకవేళ మీ బద్ధకంలో అది జారిపోతే దాని కొరకు ఏడుస్తూ చేతిలో ఉన్న క్షణాన్ని కూడా వ్యర్థం చేయకండి. అప్పుడు రెండిందాల నష్టపోయేది మీరే. కనుక వెంటనే కర్తవ్యోన్ముఖు లుకండి.

"My past id cristalised in my present" – అంటారు స్వామి చిన్మయానందులు. ఒక మారుమూల కేరళ నివాసియైన గుర్తించబడని **"బాలన్"** ఈ రోజు విశ్వవిఖ్యాతులైన స్వామి చిన్మయానందు లైనారంటే తన నలభై ఏళ్ళ జీవితంలోని ప్రతి క్షణాన్ని ఆయన సద్వినియోగపరచుకున్నాడు గనుకనే.

మీరుఏం చేయాలో దానికి ఒక ప్రణాళిక (Plan) ఏర్పాటు చేసుకోండి. ఒక సంవత్సరంలో ఎంత పూర్తిచేయాలి. నెలలో ఏమి చేయాలి. ఏరోజు ఏమి చేయాలి అన్న విషయంలో సునిశ్చయ రూపురేఖలు దిద్దు. అది ఒక దేశమైనా. సంస్థఐనా వ్యక్తిఐనా అందరికీ ఈ ప్రణాళిక అవసరం. ఆ సిద్ధం



చేసిన ప్రణాళికను పూర్తిచేయడానికి ప్రయత్నించండి. స్వామి చిన్మయానందుల మాటలో చెప్పాలంటే " Plan out your work and work out your plan" ఇంత సాధారణమైన నిర్ణయమైనా మొదలుపెట్టి చేసినప్పుడే మనోబలం దృఢ మౌతుంది.

ప్రసిద్ధ నవలాకారుడు "చార్లెస్ డికెన్స్" ఇలా అంటూ ఉండేవాడు. "ధ్యానం ఒక ఉపయోగీ, నిరాపద, నిశ్చిత, లాభదాయకమైన ప్రాప్తనీయ గుణం" నియమం ప్రకారం మనం ఏపనైనా చేసినప్పుడే ధ్యానం యొక్క శక్తి ఉత్పన్నం అవుతుంది.

ప్రత్యేక సమయంలో మనలోని శక్తి తనంతటతానే తమ కర్తవ్య పాలనలో నిలుస్తుంది. పూజ, స్వాధ్యాయం, చింతన అన్నిటికీ ఇదే విధానం. కనుక ప్రతి దినం నిర్ణయించిన పనిని నియమంతో చేయండి.

విద్యార్థీ, లౌకికుడు, సమాజ సేవకుడు, వ్యాపారీ ఎవరైనా కానీ అందరికీ ప్రణాళికాబద్ధమైన కర్మలోనే ఫలం లభిస్తుంది. అప్పుడే ప్రతికర్మా పూజ అవుతుంది.

ఏపని పూర్తిచేయాలన్నా ప్రణాళిక (Plan)అవసరం. ప్రణాళిక మళ్ళీ కాగితంపైన పెడితేగాని సిద్ధంకాదు. ఎంతపని ఎంత సమయంలో చేయాలి అనేది నిశ్చయించినప్పుడే ప్రగతి సాధ్యమౌతుంది. ప్రగతి కొరకు తత్పరత అవసరం. తత్పరత ఎప్పుడొస్తుందంటే ఒక నిశ్చిత సమయంలో ఒక కార్యం చేయవలసి ఉన్నప్పుడు.

ఈ విధంగా ప్రణాళిక అత్యవసరం. జీవితంలోని ప్రతి క్షణం ఒక పరీక్ష అని అనుకొని, లక్ష్యప్రాప్తి కొరకు ప్రతిరోజు కొంత శ్రమించండి. ప్రణాళిక పూర్తి చేయడం కొరకు నియమిత రూపంలో, నిశ్చితక్రమంలో కర్మచేయండి.

**కిరీటాన్ని ధరించే శిరస్సు సుఖానికి దూరమౌతుంది**

**–షేక్స్పియర్.**

# 9. దృఢ సంకల్పం

విజయానికి మూలం దృఢ సంకల్పం. అన్ని గుణాలు ఒకవైపు, దృఢ సంకల్పం ఒక్కటీ ఇంకొక వైపు. దృఢ సంకల్పం కలిగిన వ్యక్తికి జీవితంలో ఎప్పుడూ, ఏ క్షేత్రంలోనూ అపజయం లేదు.

**"స్వెట్ మార్టెన్"** ఇలా వ్రాస్తారు.

**"ఏ నవయువకులైతే జీవితంలో తమకు ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పాటు చేసుకోదలచి శీలవంతులు కాదలచుకున్నారో, తమలోని పౌరుషాన్నంతా పాచికలో పెట్టి జీవిత జూదం ఆడటానికి నిశ్చయించుకున్నారో వారికి యశస్సు, కీర్తి, ధనమూ లభించకున్నా వారుమాత్రం అపజయంపాలు కారు."**

సంకల్పంలో చాలా బలం ఉంది. ఎటొచ్చీ ఆ విచారధారను కార్యరూపం లోకి మలచినప్పుడే అది ప్రకటమౌతుంది. కానీ ఆలోచించడంవేరు, ఆలోచనను కార్యరూపంలోకి తీసుకురావడం వేరు. కనుక మీ దృఢ సంకల్పమే మీకు అక్షయ శక్తినిస్తుంది.

మనిషిలో సుగుణాలున్నాయి, దుర్గుణాలూ ఉన్నాయి, బలమున్నది, బలహీనత కూడా ఉంది. దృఢత్వం ఉంది. పిరికితనం కూడా ఉంది. విశ్వాసం ఉంది. సందేహం కూడాఉంది. కనుక ఉన్నత శీలం కొరకు సద్గుణాలను వికసింప చేద్దాం. ధైర్యం, విశ్వాసం, ఏకాగ్రత, సహిష్ణుత, త్యాగాది గుణాలను మనం ఆదరించినప్పుడే అవి మనలో ప్రవేశిస్తాయి. మనం ధర్మం కొరకు, శీలం కొరకు, ఇతరుల సేవ కొరకు పడే కష్టంలోనే సుఖానుభవం పొందిననాడు సంఘర్షణ యొక్క శక్తి మనలో ఉత్పన్నమౌతుంది. బద్ధకంగా అనిపించిన క్షణంలోనే మనం నడుంకట్టి పనిలోనికి వెళితే మనలో పనిచేయగల శక్తి ఉత్పన్నమౌతుంది. అప్పుడే మనం నిజమైన కర్మవీరులం కాగలం. ఆశ, లోభత్వం, మొదలైనవి మనలో పొడచూపినప్పుడే వాటిని తిరస్కరించాలి. కర్తవ్యం ఆచరించడమే నాధర్మం అని మనస్ఫూర్తిగా అనుకోగలిగిననాడు మనలో దృఢ నిశ్చయం యొక్క శక్తి వికసితమౌతుంది.



స్వార్థానికి పరమార్థం, లోభానికి త్యాగం, బద్ధకానికి కర్మశీలత విరోధులు. కనుక ఎప్పుడైనా మిమ్మల్ని ఏ దుర్గుణమైనా వెంటాడితే దాని విరోధి గుణాన్ని ఆహ్వానించండి. మనోవాక్కాయ కర్మలతో దాని ప్రాప్తి కొరకు ప్రయత్నించండి. ఏ దుర్బలగుణానికి శరణివ్వడానికి ఒప్పుకోకండి. ఫలతః అది వెనక్కు తిరిగిపోతుంది. అర్ధరాత్రి ఎవరో మీ తలుపుకొట్టారు ఎవరంటే పలకరు. కిటికీ గుండా చూస్తే చింతనిప్పుల్లాంటి, ఎఱ్ఱని కండ్లు, చింపిరి జుట్టు, మాసిన గడ్డం, గుబురు మీసాలు, దట్టమైన కనుబొమ్మలు, బుగ్గమీద పులిపిరిగింజ, నోట్లో బీడి, ఎత్తయిన పొట్ట, పైనుండి జారిపోకుండా బెల్టు పెట్టబడ్డ గళ్ళలుంగీ, మాసిన టీషర్టు, నల్లటి శరీరం, చేతిలో కత్తి దర్శన మిచ్చాయి. అయ్యా రెండోఆట సినిమా చూసి వస్తుంటే నన్నెవరో తరుముకు వస్తున్నారు. దయచేసి నాకు శరణివ్వండి అంటే మీరు అతణ్ణి లోనికి రానిస్తారా? లేదు. కర్కశంగా వెళ్ళి పొమ్మంటారు. లోపలికి రానిచ్చారా? శరణంటూ వచ్చిన ఆ దుర్గుణం మహా యజమానై కూర్చుంటుంది. లేక ఈ దుర్గుణాలు తలుపు కొట్టకుండానే వస్తాయని గనుక ఎవరైనా అంటే అది లోపలకు వచ్చినా నివసించడానికి అనుకూల పరిస్థితి నివ్వకండి. చీకటి, చిత్తడి, దుర్గంధభూయిష్టమైన స్థలాల్లోనే దోమలు గుడ్లు పెడతాయి. బాగావెలుతురు ఉండి గాలివీచే పొడి స్థలాల్లో గుడ్డు పెట్టవు. కనుక మీరు మీ జీవితాన్ని గంగలాగా పవిత్రంగా, నిర్మలంగా ఉంచుకోవడానికి ప్రయత్నించండి. దానిలోకి దురాలోచనలు రాకుండా చేయండి. జీవితంలోని ఏమూలలోనూ దరిద్రత, బద్ధకం, రోగం, సందేహం, భయం మొదలైన వాటికి స్థానం ఇవ్వకండి. ఇచ్చారా అవి పురుగుల్లా మీ జీవిత కాండాన్ని తొలచి వేయగలవు.

దృఢత్వమే మిమ్మల్ని లేపి నిలబెట్ట గలుగుతుంది. మీ దృఢత్వం సంకల్పశక్తి సడలిపోయే పనిచేయకండి. అటువంటి ఆలోచనే మీ మనస్సులోకి రానివ్వకుండా చూసుకోండి. మీ జీవితమనే ఇంటికి మీరే స్వయంగా ద్వారపాలకులు. నిరంతరం మీ జీవన గృహాన్ని మీరే రక్షించుకుంటూ దుర్బలత అనే దొంగ జొరబడకుండా చూసుకోవాలి.

శీలవంతుడైన వ్యక్తి పర్వతంలా దృఢుడై ఉంటాడు. అతడి దృష్టిలో అతడి సిద్ధాంతానికి, శీలానికి మాత్రమే విలువున్నది. ప్రపంచంలోని ధన, ధాన్య, సౌభాగ్యాల కొరకు అతడు తన శీలాన్ని బలిపెట్టడు. అతడి విజయం అందులోనే ఉంది. అతడే దృఢ సంకల్పవంతుడు, అజేయుడు, ప్రతిపురుషార్థీ అలాగే ఉండాలి.

నోబుల్ బహుమతి గ్రహీత శ్రీ రవీంద్రనాథ్ ఠాగూర్ ఒకగీతం వ్రాశారు **"అకేలా చెలోరె"** (ఒంటరిగా సాగిపో బాటసారి) అని. అది పురుషార్ధికి ఎంతో ప్రేరణనిస్తుంది. ప్రతి వ్యక్తితన మార్గంలో ఒంటరిగానే ప్రయాణించవలసి వస్తుంది. మీరు భయపడకండి. సిద్ధాంత ప్రియుడైన వ్యక్తి సహాయకుడి కొరకు ఎదురు చూడడు. ఒంటరిగానే తాను నిశ్చయించుకున్న మార్గంలో ప్రయాణిస్తాడు. ఎదురుగా ఉన్న సత్యమే అతడి జీవనం.

మన ప్రాచీన ఇతిహాసాలలో ఎందరో మహాత్ములు కనిపిస్తారు. వారు ఏనాడూ తమ నిశ్చయం నుండి వైదొలగలేదు. రాముడి వన గమనంలో దృఢత్వం, భరతుడి భాతృభక్తితో దృఢత్వం, భీష్ముడి బ్రహ్మచర్య దీక్షలో దృఢత్వం, మనకు తెలియనివి కావు. అయినా మీరు అనవచ్చు ఇవన్నీ ఎవరు చూశారు. నిజంగా ఈరోజు కూడా అంత త్యాగం, దృఢత్వం, సాధ్యమా? అని. అయితే వినండి. ఒక ఆధునిక వ్యక్తి యొక్క ఆశా-నిరాశా, గెలుపు-ఓటముల, సంఘర్షణ-విజయాల వృత్తాంతం ఎంత ప్రేరణాత్మకంగా ఉంటుందో చూడండి.

ఒక వ్యక్తి 30 ఏండ్ల నిరాశతో యుద్ధం చేస్తూ వచ్చాడు. చివరికి దానికి చిత్తుచిత్తుగా ఓడించాడు. మళ్ళీమళ్ళీ ఓడిపోతూ కూడా ధైర్యాన్ని పోగొట్టుకోలేదు. చివరికి విజయలక్ష్మి అతణ్ణి వరించింది. ఈ వ్యక్తికి 1831లో వ్యాపారంలో విపరీతమైన నష్టాలు వచ్చాయి. కూడబెట్టిన ధనం అంతా కరిగిపోయింది. వ్యాపారంలో ఎంతో ఎత్తు ఎదగాలనుకున్నా అతడు, చివరికి వ్యాపారంలో తాను రాణించనని తెలుసుకున్నాడు. కాని అపజయాన్ని అతడు ఒప్పుకోలేదు. మనస్సులో "బయటి పరిస్థితులు మారడం ఎంతో సహజం. కానీ ఆంతరిక పరిస్థితులే నిజానికి ప్రపంచాన్ని మార్చేవి. కనుక నేను అపజయాన్ని లోపల ఒప్పుకోను. కాకపోతే వేరే క్షేత్రంలో నేను విజయం కొరకు ప్రయత్నిస్తాను" అనుకున్నాడు.

నిరాశతో నిండిన నిర్బలమైన మనస్సు పిరికితనంతో అభద్రతా భావనను ప్రేరేపిస్తుంది. కాని ఈ వ్యక్తి ఆశావాది. ఎంతో సాహసి, కార్యంలోశూరుడు, మనోదృఢత్వంతో, విశ్వాసంతో, నేను నలువైపుల నుండి వచ్చే విపత్తులను జయిస్తాను అనుకున్నాడు కనుక ఆ క్షణంలోనే ఇక ముందు జీవితంలో తనకు ఎదురవ్వబోయే కష్టాలతో యుద్ధం చేయటానికి నిర్ణయించుకున్నాడు.

అతడు తన దేశమైన అమెరికా లెజిస్లేచర్ ఎన్నికల్లో నిలబడ్డాడు. ఎన్నో రకాలుగా ఎన్నికల యుద్ధానికి సంసిద్ధుడైనాడు. జనతా జనార్ధనుణ్ణి ఎన్నో రకాలుగా సేవించాడు. అందరినీ తన పక్షం చేసుకోవడం కొరకు ధర్మ మార్గాన్ని అనుసరించాడు. అతడికి తన సాఫల్యం పైన పూర్తి విశ్వాసం ఉంది...



కానీ అయ్యో! లెజిస్లేచర్ ఎన్నికలలో కూడా ఓడిపోయాడు. 1832వ సంవత్సరం అతని జీవితంలో వ్యర్థమైంది. ఆయన మళ్ళీ ఈ విధంగా ఆలోచించాడు. "బహుశ నేను పొరపాటు చేశానేమో! నేను మళ్ళీ ఒకసారి వ్యాపారమే ఎందుకు చేయకూడదు? అంటూ మళ్ళీ వ్యాపారం మొదలెట్టాడు.

1833లో మళ్ళీ అతనికి వ్యాపారంలో నష్టాలు వాటిల్లాయి. ఇప్పుడు ఏం చెయ్యాలి. ఏం క్షేత్రంలో తాను రాణించగలడు? 1834లో మళ్ళీ క్రొత్త ఉత్సాహంతో, లెజిస్లేచర్ ఎన్నికలకు మళ్ళీ ఎన్నో ఏర్పాట్లు చేశాడు. భాగ్యదేవత 1835 లో మళ్ళీ ఆయన్ను దెబ్బకొట్టింది. ఇది ఆయన వ్యక్తిగత జీవితానికి సంబంధించింది. ఆ సంవత్సరం ఆయన యొక్క ప్రియపత్ని మరణించింది.

సాధారణమైన వ్యక్తి ఈ మానసిక అఘాతంతో పిచ్చివాడౌతాడు. కానీ ఆయనలో దాగున్న సాహసం, కార్యదక్షత పెరుగుతూ వెళ్ళింది. పరిస్థితులలో యుద్ధం చేస్తూ చేస్తూ 1836లో ఆయన "స్నాయు" రోగంతో పీడించబడ్డాడు. అయినప్పటికీ మళ్ళీ స్పీకర్ ఎన్నికలలో నిలబడ్డాడు.

కానీ కష్టాలు పిడుగుల్లాగా ఆయనపై ఒకదాని తరువాత ఒకటి వచ్చిపడటం మొదలెట్టాయి.

1837లో స్పీకర్ ఎన్నికలలో అపజయం.

1843లో ల్యాండ్ ఆఫీసర్ నియుక్తిలో అపజయం.

ఎంత భయంకరమైన మానసిక అఘాతం? అయినా ఆయన దానిని ధైర్యంగా ఎదుర్కొన్నాడు. బయటపడ్డాడు.

ఆయన ఉత్సాహం, శౌర్యం ఆయనను ప్రేరేపిస్తూనే ఉన్నాయి. ఆయన ఓటమి నొప్పుకోలేదు. అయినా ఓటములధార ఆగనూ లేదు.

1846 కాంగ్రెస్ ఎన్నికలలో అపజయం. 1848లో మళ్ళీ కాంగ్రెస్ ఎన్నికల్లో అపజయం. అయినా వెనుకాడలేదు. 1855 సెనేట్ ఎన్నికలలో మళ్ళీ అపజయం. ఆయన వికట పరిస్థితులకు లొంగలేదు. భయపడలేదు. ఈసారి వైస్ ప్రెసిడెంట్ పదవి కొరకు పోటీ చేశాడు.

1856 వైస్‌ప్రెసిడెంట్ ఎన్నికలలో కూడా అపజయం ఆయన తన సర్వస్వాన్నీ వదులుకోవడానికి సిద్ధమేకాని, కర్కశపరిస్థితులకు తల ఒగ్గడానికి సిద్ధంగా లేడు. ధైర్యాన్నిచిక్కబట్టుకొని పూర్తి బలాన్ని ఉపయోగించి యుద్ధం చేస్తున్నాడు. తనలోనే కాదు తన చుట్టు ప్రక్కల వారందరిలోను వీరత్వాన్ని మేల్కొలుపుతున్నాడు.

మరల 1858లో సెనేట్ ఎన్నికలలో అపజయం.

అతడికి సంఘర్షణలోనే 27 సంవత్సరాలు గడిచిపోయాయి. కాని ఆయన సాహసం బీటలువారలేదు. ఆయన స్థానంలో ఇంకే వ్యక్తయినా ఉంటే ఈ పాటికి వెయ్యి ముక్కలయ్యేవాడు, కాని విజయాపేక్షలో ఆయన ఇంకా నిలచి ఉన్నాడు.

సమయం మారుతోంది. ఇప్పుడు పరిస్థితులు అతనివైపు మొగ్గ చూపుతున్నాయి. స్వావలంబనపై విశ్వాసం చూపబడుతోంది. ఆహా! చూడండి ఆయన గెలిచాడు. విజయలక్ష్మి ఆయన్ను వరించింది.

1860లో ప్రెసిడెంట్ ఎన్నికల్లో ఆయన గెలుపొందాడు. సర్వోత్కృష్ట పదవి ఆయనకు ప్రాప్తించింది. 30 ఏండ్లు నిరాశా ఊయలలో ఊగినప్పటికి ఇప్పుడు ఆశాజ్యోతి వెలిగింది. సంపూర్ణ విజయం ఆయనదైంది.

సార్వజనిక సన్మానం, యశస్సు ఆయన్ను వరించాయి. ఇంతకు ఈ విజయం వైజయంతీ పతకాన్ని ఎగురవేసింది ఎవరంటారు?

ఇతడు ఒక మామూలు గ్రామీణ యువకుడు. ఈ సాహసి ఇచ్ఛాశక్తితో తనను ఆవరించిన కష్టాలనే తుఫానులను ఛిన్నాభిన్నం చేశాడు. ఈయన ఏనాడు తన దౌర్భాగ్యం ముందు ఓటమిని ఒప్పుకోలేదు. దృఢ ఆత్మవిశ్వాసాన్ని చేతికర్రగా చేసుకొని, నిత్యనూతన ఉత్సాహంతో జీవనమార్గంలో ముందుకు నడుస్తూ వెళ్ళాడు.

ఆయనే అమెరికన్ భూత పూర్వ రాష్ట్రపతి.

**"అబ్రహం లింకన్"**

ఒక నిముషం ఆలోచించండి. ఒకవేళ ఆవ్యక్తి ఒకటి రెండు కష్టాలకే గనక ఓటమి నొప్పుకుంటే, భయభీతుడై సాహసాన్ని విడిచిపెడితే, 30 సంవత్సరాల తరువాత ఇంతకీర్తి యశస్సు, సన్మానాలు పొందగలడా?

మరిమీరు చిన్న పరాజయానికే కష్టానికే నిరాశపడతారెందుకు? సాహసవంతులుకండి, సాహసం యొక్క వ్యాపకార్థాన్ని తెలుసుకోండి.

**"ప్రాంచో అగామన్నృత యేహసాయ"** (అధర్వవేదం) గుర్తుంచుకోండి. ఈ జీవితం నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ జీవించడం కొరకే ఉంది. భయం, శోకం, క్రోధం, నిరాశ మొదలైన వాటిలో పడి ఉండటం మహా మూర్ఖత.

> **చాలామందిని పతనం చేసినవి ఏమిటో తెలుసా? వారి విజయాలే!**
> **- ఫెడ్రస్**



## 10. కష్టాలతో యుద్ధం చేయండి

" meet Life as it reaches you,with or without the things our Mind demand. Life can be a brilliant success."

– స్వామి చిన్మయానంద

జీవితమంటే సంఘర్షణ. పరిశ్రమ చేయకుండానే సిద్ధించే పని ఏదీ ఈ లోకంలో లేదు. శక్తివంచన లేకుండా ప్రయత్నించడం ద్వారానే కార్యసిద్ధి కలుగుతుంది. నిజంగా మీరు జీవితంలో విజయమే కోరుకునేట్లయితే సర్వశక్తులు వినియోగించి ప్రయత్నించండి. ఏ కష్టాన్నిగాని, వ్యక్తినిగాని పట్టించుకోవద్దు. అమెరికా అధ్యక్షుడయిన **థియోడర్ రూజ్‌వెల్ట్** యొక్క విజయానికి ఇదే కారణం. ఆయన ఏది నిశ్చయించినా దానిని సాధించడం కొరకు తన సంపూర్ణవ్యక్తిత్వశక్తిని సంకల్పంతోపాటు కలిపేవాడు. ఆయన సగం మనస్సుతో ఏపని చేసేవాడుకాదు. అలా పూర్తి మనస్సుకు పనిలో నియోగించినవారికి మార్గం తనంతటతానే ఏర్పడుతుంది.

ఎవరైతే కష్టాలగురించి ఆలోచిస్తారో వారినే అవి బాధపెడతాయి. వాటి భయంలో అతడు మార్గాన్ని విడిచిపెడతాడు. అటువంటివారు జీవితంలో ఎప్పుడూ సఫలులుకాలేరు. వారు పిరికి పందలు. కొద్ది కష్టం వచ్చిందంటే పారిపోతారు. నిజానికి జీవితంలో కష్టాలు ఎక్కడ మాత్రం లేవు? కాని ఏ వ్యక్తిఅయితే ఈ బాధలన్నింటినీ సహించి తన ఆదర్శం పూర్తిచేసుకుంటాడో అతడే మహాత్ముడౌతాడు. తపస్సు చేయనిదే సంసారంలో ఖ్యాతిపొందడం సాధ్యంకాదు. ఈ సంసారంలో ఎవరికి ఎంత ఎక్కువ ఖ్యాతి ఉందో వారు అంత ఎక్కువగా తపస్సు చేశారని తెలుసుకోండి. యుద్ధం చేయడంలో ఉంది గొప్పదనం. పారిపోవడంలో కాదు.

ప్రపంచంలో ఏదేశ చరిత్ర వెదికి చూసినా నాగరికత యొక్క వికాసం సంఘర్షణతో నిండిఉంది. ఆరోజు మన పెద్దలు స్వాతంత్ర్యం కొరకు పోరాడకపోతే, మనవారంతా భార్య, పిల్లలు, సుఖభోగాలు త్యాగం చేసి ఆత్మార్పణ చేయకపోతే ఈరోజు మనకీ సుఖాలు లభించేవా? ఈరోజు కలోగంజో కాచుకు త్రాగుతూ పరుడిచెప్పు క్రిందపడి ఉండకుండా ఉన్నామంటే ఆ గొప్పతనం ఆరోజు సంఘర్షణది కాదా? ఆ మహాత్ముల తపస్సు ఫలితం కాదా? ఆరోజు మనవారు బ్రిటీష్ వారితో యుద్ధం చేయక పోతే అది సాధ్యమయ్యేదా? పిల్లవాడు కష్టాలకు భయపడితే ఏనాడూలేచి నిలబడలేడు, నడవలేడు,పరిగెత్తలేడు, స్వతంత్రుడై సంపాదించు కొని తినలేడు. సేన యొక్క రక్తం ప్రవహించినవాడే దేశం రక్షించ బడుతుంది. కష్టాలకు భయపడవద్దు, వాటిని ఎదురొడ్డి నిలబడటం నేర్చుకోండి.

ఆదర్శాల రక్షణ కొరకు కష్టాలతో యుద్ధం చేయక తప్పదు జీవితంలో ప్రతి అడుగులోను కష్టాలు ఎదురౌతాయి. మీ సాహసాన్నంతా వెచ్చించి వాటితో యుద్ధం చేయాలి. ఈ ప్రపంచంలో లోభులు, లాలసలు, మోస కారులు మొదలైన వారి సంఖ్య ఎక్కువగా ఉంది. ఈ విధంగా ఉండటంవల్ల వీరు సుఖంగా బ్రతకగలరు. సత్యాన్ని, ధర్మాన్ని, ఆదర్శాలను ముందుంచుకొని జీవించడం ఈ ప్రపంచంలో చాలా కష్టం. ధర్మమార్గంలో ఉన్న మిమ్మల్ని క్రిందకి, తోసివేయడానికి ఎన్నో రకాలుగా ప్రలోభ పరుద్దామని చూస్తారు. ఆ క్షణంలో మీరు బలహీనతకు లోనయ్యారా క్షణిక ఆనందం లభించినా, జీవితాంతం మనోగ్లాని మిగులుతుంది. ఆదర్శ మార్గంలో వెళ్ళి డబ్బు సంపా దించుకొంటున్న వారిని చూసి ఈర్ష్యపడకండి. డబ్బు ముఖ్యం అనుకుంటే మీరు కూడా అదే మార్గంలో వెళ్ళేవారు. మీరు దానికన్నా మనశ్శాంతి ముఖ్యం అనుకున్నారు. కనుకనే ఈ మార్గంలోఉన్నారు.

**జీవితంలో ఒక లక్ష్యం ఏర్పరచుకోవాలి.**
**తరువాత ఆ లక్ష్యంకోసం సర్వశక్తినీ వినియోగించి కృషిచేయాలి.**
**– కార్లైల్.**



## 11. నిరాశ నుండి బైటబడండి

**"పృధివ్యా సర్వభత్తూణాం కఠోర తమ ఈశ్వరః ।**
**నాననహం జానామి అత్యంతం యుష్మాన్పరీక్షతే॥"**

ఈశ్వరుడే సంసారంలో అందరికన్నా కఠిన హృదయుడు. నిన్ను పరీక్షించడం కొరకు ఇంతగా కష్టాలుపాలుచేసే స్వామినెవరిని నేను చూడలేదు.

ఆశావాదిగా! కష్టాలు పరీక్షలేకాని నీ జీవితానికి అంతాలు కావు. బంగారం బాగా కాగితేనే స్వచ్ఛంగా తయారయ్యేది. రాయి ఉలిదెబ్బలు తింటేనే అందమైన విగ్రహంగా మారేది. వడ్లు రోకటి దెబ్బలు తింటేనే బియ్యంగా మారేది.

1914లో థామస్ ఎడిసన్ యొక్క లేబరేటరీ (ప్రయోగశాల) అగ్ని ప్రమాదా నికి లోనయ్యింది. కోటానుకోట్ల రూపాయల విలువగల యంత్రాలు, రసాయన పదార్ధాలు వస్తుసామగ్రి అగ్నికి ఆహుతియైనాయి.

ఆయన జీవితంలో కనుగొన్న ఎన్నో రహస్యాలకు సంబంధించిన కాగితాలు తగలబడి పోయియి.

ఈ దుర్ఘటన గురించి విన్న ఎడిసన్ కుమారుడు ఛార్లెస్ ఆయనను వెతుకుతూవచ్చి తగులబడుతున్న ఈ ప్రయోగశాల ప్రక్కన నిలబడి ఎగసిబడుతున్న జ్వాలలను ఆనందంగా చూస్తున్న తండ్రిని చూచాడు.

తన కుమారుడిని చూసి "మీ అమ్మ ఎక్కడరా? వెంటనే వెళ్ళి ఆవిడను తీసుకురా? మళ్ళీ ఇటువంటి సంఘటన ఆవిడ జీవితంలో చూద్దామనుకున్నా కనిపించదు" అన్నాడు.

ఆ రెండువరోజు బూడిదకుప్పల మధ్య నడుస్తున్న ఆ అరవైఏడు సంవత్సరాల వృద్ధ శాస్త్రజ్ఞుడున్నాడు. నాపొరపాట్లన్నీ తుడిచివేశా కరుణామయా! సర్వనాశన రూపంలో ఇక్కడ ప్రవేశించి మళ్ళీ క్రొత్తగా నన్ను మొదలు పెట్టమని ఆజ్ఞాపిస్తున్నావా పరమాత్మా! అలాగే నీఆజ్ఞను శిరసావహిస్తాను".

పరమాత్మ యొక్క కృప అనంతం ఏ రూపంలోనైనా రావచ్చు. దానిని చూసి గుర్తించగల కండ్లు నీకు ఉండాలి అంతే.

"జోచన్‌హై బర్కేచమన్ సాజ్‌కో తో జిద్‌హీసహీ

హమ్ ఆజ్ అపనా నశేమన్ బనాకే దేఖేంగే"

పిడుగులు పడతాయని నిర్ణయించుకున్నా ఫరవాలేదు. అయినా సరే మేము మాఇల్లు కట్టుకొని తీరుతాము. తుఫానులు వచ్చినా సరే మేముమాత్రం మా మార్గంలో పురోగమిస్తాము. ఇవన్నీ పరీక్షలు.

జీవితాన్ని ప్రాణహీనంగానూ, నిస్సారంగాను మార్చేది నిరాశ. అందుకే నిరాశను అంధకారంతోన, ఆశను ప్రకాశంతోను పోల్చారు. ఈ సత్యాన్ని అందరూ ఎరుగుదురు. కాని నిరాశ అందరినీ వెంటాడుతోంది. నిరాశనే మీరు ఎందుకు విశ్వసిస్తున్నారు? ఏవిధంగా వెలుతురులేని తనాన్ని చీకటి అంటారో అలాగే ఆశ విశ్వాసం లేని స్థితిని నిరాశ అంటారు. కనుక నిరాశకు ఎప్పటికీ అస్థిత్వంలేదు. ఈ నిరాశ మన యొక్క నిర్బలత్వం నుండి ఉత్పన్నమౌతుంది. ఉత్సాహం నిండిన మనస్సులోకి నిరాశ ప్రవేశించలేదు. భూతకాలపు అనుభవాలే వర్తమానంలో మనలను నిరాశకు లోను చేస్తుంటాయి.

("Time demolishes the steps we climb to reach the present there is no going back only going forward is possible") కాలం మనం ఎక్కివచ్చిన మెట్లను నాశనం చేసింది. మనం వెనక్కువెళ్ళడానికి వీలులేదు. మార్గమెప్పుడూ ముందుకే తీసుకువెళుతుంది. కనుక భూతకాలమనే శవాన్ని భుజాలనుండి దించి ఆనందంగా ముందుకుసాగండి.

"Not only a seed is a seed, man is also a seed, not only seeds bloom man also blooms" బీజాలే బీజాలు కావు. మనుషులు కూడా బీజాలే. ఏదోనాటికి వారు కూడా పూలలా వికసించగలరు.

సూఫీ సంప్రదాయంలో అబ్దుల్లా అనే మహాత్ముడి కథలు కనిపిస్తాయి. ఆయన ఉదయం లేవగానే మంచంమీద లేచి కూర్చోని "అబ్దుల్లా ఇది నీ జీవితం. మరి ఈరోజు ఆనందంలో గడపదలుచుకున్నావా? దుఃఖంలోనా?" అని తనకు తాను ప్రశ్నించుకునేవాడు. వెంటనే లోపలి నుండి ఆనందంగా గడప దల్చుకున్నాను" అని జవాబు వచ్చేది. "కనుక ఏ పరిస్థితులు ఎలా మారినా ఎంత కష్టదాయకమైన సంఘటనలు ఎదురైనా ఎటువంటి దుర్వార్తలు విన్నా సరే నువ్వు మాత్రం ఆనందంగా ఉండు" అనేవాడు. మీరు సుఖంగా, ఆనందంగా, ఉత్సాహంగా ఉండదలచుకుంటే దుఃఖాన్ని పట్టించుకోకోకండి. కష్టదాయక పరిస్థితులే మీకు ఎదురవవచ్చు. కానీ మీరు అనుమతించనిదే దుఃఖం మాత్రం మీలో ప్రవేశించలేదు.



నిరాశ అన్నిటికన్నా పెద్దరోగం. ఒకసారి ఈ రోగం మీకు సోకిందా ఇక జీవితమంతా చింతా, అశాంతి మిగులుతుంది. అందుకే దానిని దగ్గరికి రానివ్వకండి. నిరాశా క్షణాలలో దాని శత్రువైన ఆశను స్మరించండి. మనస్సును విచలితం కావద్దని ఆదేశించండి. జీవితమన్నాక ఎత్తుపల్లాలు ఉండకపోవు. ప్రయత్న శీలుడు అపజయ పొందలేడు. కాకపోతే ఆయన జీవితం సంకటపూర్ణమై తీరుతుంది. సంకట పరిస్థితులు లేకపోతే సంఘర్షణే లేదు. సంఘర్షణ లేని జీవితలో మనోహరత అంతమై పోతుంది.

జీవితంలో సమృద్ధి వైరాగ్యం వల్లగానీ ఉదాశీనత వల్లగానీ లభించదు. ప్రవృత్తివల్లే లభిస్తుంది. ప్రవృత్తి రుచితో సంబంధం కలిగి ఉంటుంది. మన మనస్సులో ఏదైనా వస్తువును పొందాలన్న ఆకాంక్ష ఉన్నప్పుడే రుచి ఆవిర్భ విస్తుంది. ఆకాంక్ష ఎప్పుడు ఆశాయుక్తమై ఉంటుంది కేవలం ఆశ, ఆకాంక్ష మనస్సులో నిలుపుకున్నంత మాత్రాన, వస్తుప్రాప్తి లేదా ఇష్టప్రాప్తి కలుగదు. మాటలలో అంధకారం అంతం కాదు. దీపం వెలిగించవలసిందే.

సఫలత పొందిన వ్యక్తులందరి జీవనరహస్యం ఒక్కటే వారెప్పుడూ తమ జీవితంలో నిరాశకు చోటివ్వలేదు.

సర్ జగదీశ్ చంద్రబోస్ ఆధునిక భారతానికి ప్రథమ వైజ్ఞానికుడు. చెట్లకు, మొక్కలకు (వృక్షజలాలన్నిటికి) ప్రాణం ఉంటుందనే సంగతి పరిశోధించి ఆయన ప్రపంచాన్నంతా ఆశ్చర్య పరిచాడు. "అన్య జీవధారలలాగే సుఖదుఃఖాలను, ప్రకాశాంధకారాలను, శీతోష్ణతలను, ధ్వని, వాతావరణ వాయు, జల కాలుష్యాలను ఇతర అన్య ఉత్తేజాలను చెట్లు కూడ అనుభవిస్తాయి" అని చెప్పాడు.

ఈ మహా విజ్ఞానికి స్వాభిమానం మెండు. కలకత్తా విశ్వవిద్యాలయంలో అధ్యయనం ముగిసిన తరువాత 1884 మే నెలలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం నుండి డిగ్రీ పుచ్చుకొని భారతదేశం తిరిగివచ్చాడు. ప్రెసిడెన్సీ కాలేజీలో భౌతికశాస్త్ర అధ్యాపకుడిగా ఆయన నియోగించబడ్డాడు. అది బ్రిటీషువారు మన దేశాన్ని పరిపాలిస్తున్న రోజులు. వారు భారతీయులను న్యూనతా భావంతో చూసేవారు. ఒక యూరోపియన్ ప్రొఫెసర్‌కు ఇచ్చేజీతంలో భారతీయ ప్రొఫెసర్‌కు మూడులో రెండవవంతు మాత్రమే ఇచ్చేవారు. పైగా బోస్ ఆస్థాయి (Temporary) కావడం వల్ల ఆయనకు యూరోపియన్ ప్రొఫెసర్ వేతనంలో సగమే లభించేది. దీనితో కోపగించిన బోస్ "సమానమైన కార్యానికి సమాన వేతనమే లభించాలి. మీరు నాకు సమాన వేతనం ఇవ్వకపోతే నేనసలు వేతనమే తీసుకోను" అన్నాడు.

ఈ విధంగా ఆయన మూడు సంవత్సరములు వరకు హటంబట్టి ఉండి పోయాడు. కలకత్తా నగర ఖర్చులకు తట్టుకోలేక ఖరీదైన అద్దె ఇంటిని విడిచి పట్టణానికి దూరంగా ఒక సాధారణమైన ఇంట్లో తక్కువ అద్దెకు నివసించడం మొదలుపెట్టాడు.

ఊళ్ళోకి ఉద్యోగానికి రావడానికి పత్ని సహాయపడగా పడవ మీద హుగ్లీ నది దాటేవాడు. మళ్ళీ ఖాళీ పడవను ఆయన భార్య వెనక్కు తీసుకువెళ్ళేది. మళ్ళీ సాయంకాలం ఆయన కొరకు పడవ తీసుకువచ్చేది. ఆవిడ ఎంతో సహనం కలిగినదయినా సరే ఈ కష్టాలు తట్టుకోలేక ఎన్నోసార్లు ఏడుస్తూ ఆయనను, "బ్రిటీషు వారు వచ్చినంతే తీసుకోరాదంటండి" అని బ్రతిమలాడేది. బోస్ ఆవిడను ఓదారుస్తూ ధైర్యాన్ని నూరిపోసేవాడు. కానీ తన స్వాభిమానాన్ని మాత్రం ఆయన ఏనాడు వదలలేదు. ధైర్యాన్ని విడువలేదు.

చివరికి బ్రిటీషువారు ఓటమిని ఒప్పుకోక తప్పలేదు. యూరోపియన్ ప్రొఫెసర్లతో సమానంగా జీతం ఇవ్వక వారికి తప్పలేదు.

నిరాశను దగ్గరకు రానివ్వకపోవడం అంటే ఇది.

నిరాశ ఎందుకు? ఏం మీపై మీకు విశ్వాసం లేదా? లేవండి! లేచి నిలబడండి! నిరాశను విదిలించండి. ఈ మీ నిరాశ సంక్రామకం (Contigies). మీలోని ఈ నిరాశను అందరికీ మీరు మీకు తెలియకుండానే పంచుతున్నారు. చివరికిది మొత్తం సమాజాన్నే ఇది ముంచగలదు. కనుక సమిష్టి క్షేమాన్ని దృష్టిలో ఉంచుకునైనా నిరాశ విడవండి.

**అభ్యుదయకరమైన మార్పులకు ఎల్లప్పుడూ తలుపు తెరిచి ఉంచాలి.**
**- జార్జి సోరెస్**



## 12. మాట్లాడండి! కాని అవసరమైనంతే

**"మౌనమే ఉత్తమ సంభాషణ కానీ మాట్లాడ్డం అవసరమైతే తప్పక మాట్లాడు. అయితే వీలైనంత తక్కువ. ఒక శబ్దం అవసరమైన చోట రెండు వాడకు"**

**- మహాత్మాగాంధీ**

అనగనగా ఒక ఊళ్ళోఒక పెద్దమనిషి ఉండేవాడు. అతడు ఒట్టి వాగుడు గాయ. ఎవరెన్ని రకాలుగా నచ్చజెప్పినా వాగుడు మాత్రం మానేవాడుకాదు. ప్రతి విషయం తనకు తెలుసనేవాడు. తెగ గొప్పలు చెప్పేవాడు. తాను చేయలేని పని లేదనేవాడు.

ఒకసారి అతడి నేస్తమొకడు. "నువ్వు అన్నీ చేయగలవేమో కాని మన గొర్రెల గోపన్న లాగా, రాతిమీద నుండి రాతిమీదికి చెంగు చెంగున లేడి పిల్లలా దూకుతూ మన ఊరి కొండెక్కలేవు" అన్నాడు. ఆ వాగుడకాయ పెద్దమనిషికి చాలాకోపం వచ్చింది. ఆయన "అదేమీ లేదు! కావాలంటే పందెం కాయి నేను కూడా గోపన్నలాగే పర్వతం ఎక్కగలను అన్నాడు. అతడు పందెంలో ఓడిపోతే అతిగా మాట్లాడటం మానాలని లేదా అతడు కొండెక్కగలిగితే అతనికి 1000 రూపాయల నగదు ఇవ్వాలని నిర్ణయించారు.

అందరూ చూస్తుండగా గోపన్న వాగుడుగాయి కొండెక్కడం మొదలెట్టారు. ఆయనగారు తన సహజధోరణిలో తన చిన్నప్పుడు ఎలా కొండలెక్కే వాడో ఏమేమి సాహసకృత్యాలు చేశాడో చెబుతూ ఎక్కుతున్నాడు. గోపన్న చిరునవ్వు నవ్వుతూ ముందుకు సాగాడు. ఒక 10 నిమిషాలు ఎక్కేసరికి మనవాడి పని అయిపోయింది. ఆయాసంతో ఇకతాను ఒక్కఅడుగుకూడ ముందుకు వేయలేనంటూ చతికిలబడి పోయాడు. గోపన్న నవ్వుతూ, "మామూలుగా ఎక్కితే మీరూ ఎక్కగలిగే వారండి. మాట్లాడుతూ ఎక్కడం ఎవరికీ సాధ్యంకాదు" అన్నాడు.

మన వాగుడుగాయ కాసేపు ఆలోచించి ఇలా అన్నాడు. "నిజమే ఎక్కువగా వాగడంవల్ల చిన్నకొండే ఎక్కలేకపోయానే. మరి జీవితంలో విజయం అనే శిఖరాన్ని వాగుతూ చేరడం ఇంకెంత కష్టం!"

ప్రపంచంలోని అన్ని పోట్లాటలకు అనుచిత భాషణమే కారణం. విశ్వశాంతిని మనం మన అసంతులిత వాణితో భంగం చేస్తున్నాము. మన కుటుంబ సభ్యులతో, మిత్రులతో, వ్యాపార వ్యవహారాలలో చక్కగా మాట్లాడటంవల్ల

పని సానుకూలమవడం, వెగటుగా మాట్లాడటంవల్ల వ్యవహారం చెడటం రెండూ జరుగుతాయి.

మీరు మీజీవితాన్ని ఒక్కసారి సింహావలోకనం చేసుకోండి.

ఎక్కడయితే జీవితంలో మీరు అపజయం పొందారో, అవన్నీ ఒక లిస్టుగా వ్రాసుకోండి. అన్ని సంఘటనలలోనూ దాదాపు కఠోరవాణే దూరిందని తెలుస్తుంది.

ఇతరుల స్వాభిమానాన్ని మీరు దెబ్బకొట్టినప్పుడు ఇతరుల యొక్క బలహీనతలను మీరు అవహేళన చేసినప్పుడు, ఇతరుల యొక్క భావనలను మీరు నిరాదరించినప్పుడు, ఇతరులను మీరు అవమానించినప్పుడు, ఇతరుల యొక్క అవకాశం, పరిస్థితిని పట్టించుకోకుండా వారిని దోషులుగా నిలబెట్టినప్పుడు లేదా ఆసక్తి, క్రోధం, లోభం మొదలైన వాటికి మీరులోనై, మీవాణిపై, మీరు అదుపును కోల్పోయినప్పుడు తప్పక మీరు ఇతరులను శతృవులుగా మార్చుకుంటారు.

ఆచార్య రామచంద్రశుక్ల మితభాషి. ఒకసారి ఆయన శిష్యులిద్దరు ఈ విషయంపై పందెం వేసుకున్నారు. ఒకడన్నాడు "నేను గురువుగారి నోటివెంట ఒక్కసారి ఐదు మాటలు వెలువడేట్టు చేస్తాను" ఇంకొక శిష్యుడన్నాడు. ఇది సాధ్యం కాదన్నాడు.

వారిద్దరూ ఆచార్యుల వద్దకు వచ్చారు. మొదటివాడు "గురుదేవ్ నేను మీతో ఐదు మాటలు మాట్లాడిస్తానని వీడితో పందెం వేశాను, దయచేసి ఐదు మాటలు మాట్టాడండి" అన్నాడు.

ఆచార్య నవ్వుతూ **"నీవు.. ఓడిపోయావు"** అన్నారు.

వాణి అన్నిటికన్నా గొప్ప సాధన. మీ ఆలోచనలను వ్యక్తం చేయాలన్నా, భావనలను ప్రకటించాలన్నా వాణి మార్గం. కనుక మాట్లాడే ముందు ఒక్క క్షణం ఆగండి. కండ్లు మూసుకుని ఆలోచించండి. మనసులోని ఉద్రేక వేగాలకు ఆనకట్ట వేయండి. అవసరమైనంతే వాణి ద్వారా ప్రకటించండి. విజయం మీదౌతుంది.

**లక్ష ఆలోచించినా ఉపయోగంలేదు. వేయిచెప్పినా ఫలితంరాదు. ఏదో విధంగా నూరు పనులు చేసినా కూడా ఫలితం శూన్యం. శాస్త్రీయమైన ఆలోచనతో కూడిన ఆచరణతో ఒకమంచి పనిచేసి ప్రయోజనం పొందితే అది అన్నిటికన్నా మిన్న. – ఒక సూక్తి**



## 13. మనస్సుదాని అదుపు

**"మనస్సులో క్రోధం ఉత్తేజం కలుగగా దానిని శాంతివైపు మళ్ళించిన వాడిని నేను సారథి అంటాను. మనుష్యుడు క్రోధంపై అక్రోధంతోను, అసాధుతపై సాధుత్వంతోను, లోభంపై ఉదారతతోను, అసత్యంపై సత్యంతోను విజయాన్ని పొందగలడు". – గౌతమబుద్ధుడు**



డాక్టర్ ఇక్‌బాల్ గొప్ప దేశభక్తుడు. ఉర్దూ, సాహిత్యంలో గొప్ప షాయర్‌గా (కవి) కూడా ప్రసిద్ధుడు. స్వాతంత్ర్యానికి ముందు ఆయన వ్రాసిన దేశభక్తి కవితలు ఎందరో యువకులకు ఉత్తేజాన్ని ఇచ్చాయి. **"సారే జహాసే అచ్ఛా, హిందుస్తాన్ హమారా"...** అనే ఆయన గీతం హిందీ మాతృభాషగా కలిగిన ఉత్తరాదిలోనే కాదు. దానిఅర్థం తెలియని దక్షిణాదిన కూడా అది ఎంతోమంది నోట నలిగింది. డా॥ ఇక్‌బాల్ ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ ఉండేవాడు. అందుకే ఆయన కవితలు అందరినీ సంతోషపెట్టగలిగాయి.

ఒకసారి ఆయనను కలవడానికి ఒక మౌల్వీ వచ్చాడు. మాటల సందర్భంలో సంగీతం విషయం వచ్చింది.ఆ మౌల్వీ స్త్రీలు పాటలు పాడడాన్ని ఎంతో నిరసించాడు. ఆయన ఇక్‌బాల్‌తో స్త్రీలు పాడిన పాటలు వినడం వల్ల కామోద్రేకం కలుగుతుంది. అంతేకాదు వారిని చూస్తూ వారి పాట విన్నామంటే చాలు ఇక, కాముకత మరీ విపరీతమౌతుంది." అన్నాడు.

డా॥ ఇక్‌బాల్ నవ్వుతూ ఇలా అన్నాడు. "ఐతే ఒక పనిచేయండి. స్త్రీల కచేరీలకు వెళ్ళినప్పుడు లంగోటీ బలంగా లాగి కట్టుకోండి. కండ్లకు గంతలు కూడా కట్టుకు వెళ్ళండి. అప్పుడు వారి పాటలు విని ఆనందించగలరు. దానివల్ల మీకు హాని కూడా ఏమీ ఉండదు".

ఆ మౌల్వీసిగ్గుతో తలవంచుకున్నాడు.

మనస్సు మార్గాన్ని మళ్ళించడంలోనే విజయం ఉంది. ప్రస్తుతం మనస్సు యొక్క గతి ఎటువున్నది? నేనుదాన్ని ఎటుతీసుకువెళ్ళదలచుకున్నాను, అనే విషయం ఎప్పుడూ స్మృతిపథం నుండి జారనివ్వవద్దు. మీ ఆదర్శం (లక్ష్యం) వైపే మీ మనస్సు వెళ్ళాలి. వ్యర్థస్థానాల నుండి మీ మనస్సు తిరిగివచ్చి కాసేపైనా మీరు ఆజ్ఞాపించిన చోట తిరిగి కూర్చోగలుగుతుంటే మీరు తప్పక గమ్యం చేరుకోగలరని తెలుసుకోండి. మనస్సును అదుపులో పెట్టుకోవడమంటే దానిని తొక్కిపట్టడం కాదు. లేదా దానికి భయపడటం అంతకన్నా కాదు.

సుప్రసిద్ధ హిందీ కవయిత్రి మహీయాన్ మహాదేవివర్మ యొక్క జీవిత సంఘటన ఒకటి యున్నది. ఆవిడ బౌద్ధభిక్షువు అవుతూ ఆగిపోయింది. ఆవిడ స్వయంగా ఆ విషయం ఇలా చెప్పుకున్నది.

"అప్పుడు నేను ప్రీవియస్‌లో చదువుతున్నాను.ఆ రోజుల్లో బౌద్ధభిక్షువు నవ్వాలని నాకెంతో అనిపించింది.అప్పుడు సిలోన్‌లోని బౌద్ధ సంఘానికి భిక్షువు నవదలచుకున్నాను, దీక్ష తీసికోవడానికి నన్ను రమ్మంటారా లేక మీరే భారత దేశానికి వస్తారా?" అని వ్రాశాను. వారు దానికి జవాబుగా "మేము భారతదేశానికి వస్తున్నాము. నైనితాల్‌లో మా విడిది ఉంటుంది అక్కడికి వచ్చి కలవండి" అనివ్రాశారు. నేను భిక్షిణి కావాలని నిశ్చయించుకొని నా సంపత్తినంతా దానం చేశాను. నైనితాల్ వెళ్ళితే అక్కడ ఇంగ్లీషు దొరలకన్నా భోగాలెక్కువగా కనిపించాయి. వీరు భిక్షువులా? భిక్షువులే కాదలచుకుంటేఈ సంపత్తి అంతా ఎందుకు? అనుకున్నాను. సింహాసనంపై గురువుగారు కూర్చొని వున్నారు. ముఖాన్ని విసనకర్రతో కప్పుకున్నారు. నేను ఇంకోవైపునుండి అయన్ను చూడటానికి ప్రయత్నిస్తే వారి ముఖం తిప్పేసుకున్నారు. బయటకి వచ్చాక మంత్రి మహోదయుణ్ని అడిగితే **'మహాస్థవీరులు"** స్త్రీ ముఖాన్ని వీక్షించరు అన్నాడు. అంటే ఆయనపై ఆయనకే నమ్మకం లేదన్నమాట. అటువంటి బలహీనుడి నుండి నాకు దీక్ష తీసుకోవాలనిపించలేదు. ఆ తరువాత వారెన్నో ఉత్తరాలు వ్రాశారు. కానీ నేను జవాబు నివ్వలేదు.

ఈ మనస్సు అంత తొందరగా మాట వినదు.అన్నిచోట్లకు తిరిగి రావడం దాని యొక్క స్వభావం.మరి ఇది ఎలా అదుపులోకి వస్తుంది? దీనికి జవాబు గీతాచార్యుడు చెబుతున్నాడు.

**"అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే"**

అభ్యాసం వల్ల వైరాగ్యం వల్ల మనస్సు అదుపు చేయబడుతుంది.



మనస్సు దేనిని ప్రేమిస్తుందో, అన్నిటినీ వదిలి అది అక్కడికి వెళుతుంది. అలాంటి మానసిక వత్తిడినే వైరాగ్యం అంటారు. అంతే కాని బలవంతంగా వస్తువులను విడిచిపెట్టడం వైరాగ్యం కాదు. **"హంసాపామే మానససరోవర్ తాల్ తలమ్యా క్యోండోలే"** అంటాడు కబీర్‌దాస్. మానవ సరోవరాన్ని చేరిన రాజహంస చెరువులు, కుంటలకు వస్తుందా? కనుక మీకు దేనిపైనైతే ప్రేమ ఉందో దానినే లక్ష్యంగా చేసుకోండి. అప్పుడు సహజంగానే మనస్సు తక్కినవాటినన్నిటినీ వదిలి ఆ లక్ష్యం వైపుకు వెళుతుంది. రెండవది అభ్యాసం. మనసు ప్రత్యేక వస్తువు పైన ఉన్నా అలవాటు కానంతవరకూ అటూ ఇటూ పరిగెత్తవచ్చు. కనుక అభ్యాసం నిరంతరం పరిశ్రమ కూడా మనస్సుకు అవసరం.

ఈర్ష్య, ద్వేషం, చింత, అశాంతుల యొక్క తల్లి అయిన భయాన్ని సమూలంగా నాశనం చేయండి, లేదా మనస్సులో ఉత్సాహం హర్షం ఉత్పన్నం కాదు. చిత్తం ఏకాగ్రం కాదు. ఏ కార్యంలోనూ పూర్తి శక్తిని వినియోగించలేరు. కనుక మనస్సును కాస్త అదుపు చేసుకొని సఫలత పొందండి.

**పని చేయనివాడే సోమరిపోతుకాడు**
**పనిబాగా చేయని వాడుకూడా సోమరిపోతే.**

**- సోక్రటీస్**

## 14. వెక్కిరించవద్దు

**ఇతరులను ఎక్కిరించడం, వారి దోషాలు ఎత్తిచూపడం, తమ యొక్క నిర్దోషత ప్రదర్శించడానికి ప్రయత్నించడం చాలా ప్రమాదకరమైన విషయాలు.**

**– మహాత్మాగాంధి**

మనదృష్టి మనపై గాక ఇతరులపై పెట్టడం అనేది మన స్వభావంగా మారిపోయింది. ఈ స్వభావం కారణంగా వ్యవహారంలో కటుత్వం వ్యాపిస్తుంది. దీనివల్ల మిత్రులంతా శత్రువులౌతారు. మనం ఇతరులను వ్యాఖ్యానించడం వారి వ్యవహారానికి భాష్యం టీకాటిప్పణులు వ్రాయడంలోనే సమయంశక్తి అంతా వ్యర్థమైపోతుంది. ఇతరులను విమర్శిస్తూ ఉండటంవల్ల ద్వేషం, కటుత్వం, ఉదాసీనత లాంటి గుణాలు మనలో ప్రవేశిస్తాయి. దీనివల్ల మనను మనం మార్చుకోలేము దీనివల్ల వచ్చేలాభం కూడా ఏమీలేదు. ఇతరులను విమర్శించి నప్పుడు, ఎకసక్కాలాడినప్పుడు మన అహంకారానికి తుష్టికలిగి ఆనందం లభించినా, మళ్ళీ వాళ్ళు అవకాశం చూసుకొని ఒక దులుపు దులిపారంటే ఆ అవమానం జీవితాంతం హృదయంలో గాయమై నిలిచి బాధిస్తుంది.

జార్జ్ బెర్నార్డ్‌షా వ్యంగ్యబాణాలు వేయడంలో సిద్ధహస్తుడు. కాని ఆయన కూడా అప్పుడప్పుడు ఇతరుల వ్యంగ్యబాణాలు తట్టుకోక తప్పలేదు.

"షేక్స్పియర్‌డే" సందర్భంలో షేక్స్పియర్ మెమోరియల్ థియేటర్‌లో ఆయన సుప్రసిద్ధ నాటకాల్లో ఒకదాన్ని ఆరోజు ఆడబోతున్నారు. ఎందరో ప్రముఖులు ఆహ్వానించబడ్డారు.

అనుకోకుండా 'షా' కూడా అక్కడికి వచ్చాడు. అయన్ను చూచి అందరూ ఆశ్చర్యపోయారు. ఎందుకంటే 'షా'కు షేక్స్పియర్ పైన మంచి అభిప్రాయం లేదని అందరికి తెలుసు.



ఆ సందర్భంలోనే 'షా'పై వ్యంగ్యబాణం సంధించబడింది. జి.కె. చేర్ మేటన్ ముందుకువచ్చి "రండి మిష్టర్‌షా" మీరిక్కడికి రావడం చాలా మంచిదయ్యింది. చచ్చిన పులికన్నా బతికున్న కుక్క ఉత్తమం కదా" అన్నాడు.

షేక్స్పియర్ చచ్చిన పులితోను, బతికున్న కుక్కతోనూ పోల్చాడన్న సంగతి గ్రహించి కూడా "షా" ఏమీ అనలేక అవమానాన్ని దిగమింగి కూర్చున్నాడు.

ఈ విధంగా ఎదురుగా మాట్లాడటం కూడ కొంత నయమే వెనక నుండి మాట అనడం మాత్రం పరమనీచం. అది పిరికితనానికి ప్రమాణం. గోడలకు కూడా చెవులుంటాయి. మీ యొక్క అభిప్రాయాలు ఎవరితో చెప్పినా దాగవు. మీ మిత్రుడు హితైషి శ్రేయోభిలాషి అన్న అభిప్రాయంలో ఇంకెవరిపైనన్నా మీకు ఉన్న అభిప్రాయాలను తెలిపారా. ఏనాడైనా అతడు మీకు శత్రువవుతే చాలు తన స్వార్థసిద్ధికొరకు ఇతరులపై మీకు గల అభిప్రాయాలనే ఆయుధాలుగా వాడుకోగలడు.

మీ సేవకుడిని కూడా మీరు నిరంతరం "నీవు పని చేయవు. దొంగవు, అబద్ధాలకోరువు, మోసం చేస్తావు. మాకు నష్టం వచ్చేలా చేశావు, పనికిరాని వెధవవు, వస్తువులు బద్ధలుకొడతావు" అని తిడుతూ ఉంటే అతడు మిమ్మల్ని ప్రేమించగలడా? శ్రద్ధగా తనపని చేయగలడా? మీ ముందుకు చిరునవ్వుతో రాగలడా? మీ ఆరోగ్యం దెబ్బతింటే సానుభూతి చూపగలడా? మీ ఇరువురి మధ్య పెద్ద అగాధం ఏర్పడుతుంది. మీ ముందు అతడికి మిమ్మల్ని ఏమీ అనే ధైర్యం లేకపోయినా చాటుగానైనా తప్పక మిమ్మల్ని ఏదో ఒకటి అనగలడు. కనుక మీ విమర్శకు విమర్శే ఎదురౌతుంది.

మాటలతో హింసించడం ద్వారా లేదా, వారి లోపాలు ఎత్తి చూపడం ద్వారా మనం ఎవరినీ మార్చలేము. మీ హృదయభావన సేవాపూరితమై ఉత్సాహాన్ని ఇచ్చేదైయుండి, ఇతరులలోని సద్గుణాలను ప్రేరేపించేదై ఉంటే ఆ వ్యక్తి మీ వైపు ఆకర్షితుడౌతాడు. జీవితాంతం కృతజ్ఞుడై ఉంటాడు. అతడిని సంఘానికి పనికివచ్చే వాడుగా ప్రేరేపించిన కీర్తి కూడా మీకు శాశ్వతంగా నిలచిపోతుంది.

సుప్రసిద్ధ పంజాబ్ రచయిత్రి అమృతాప్రీతమ్ ఒక అమెరికన్ నవలను అనువదిస్తోంది. ఆగ్రంథంలో వచ్చిన కొన్ని శబ్దాలకు అర్థాలు ఆవిడకు నిఘంటువులో లభించలేదు. సహాయం కొరకు ఆవిడ అమెరికన్ దూతావాసానికి (ఎంబసీ) ఉత్తరం రాసింది.

అక్కడి నుండి **'శ్రీహరి వంశ సింహ్'** ఆవిడకొక నిఘంటువును పంపాడు

ఆవిడ ఆ నిఘంటువుని విప్పి ముందు పేజీ తిరగవేయగా అందులో ఇలా వ్రాసి ఉంది. " To Amrita Pritam, with all good words from this Dictionary"- అమృతాప్రీతమ్‌కు ! ఈ నిఘంటువులో ఉన్న అన్ని మంచి శబ్దాలతో.

ఈ విషయానికి వ్యాఖ్య వ్రాస్తూ ఆవిడ. "నా సమకాలీను లందరూ నా కొరకు నిఘంటువులోని పనికిరాని శబ్దాలన్నింటినీ ఉపయోగించారు. కానీ అన్నీ పనికిరాని శబ్దాలు వినేనాకు ఆ మాట చదవగానే హృదయం కంపించింది." అని వ్రాసింది.

మీ హృదయం భావం ఇతరుల ఎడ బాగా ఉన్నప్పుడు నవ్వులాటకో, లేక వినోదం కొరకో కొన్ని వ్యంగ్య శబ్దాలు వాడినా ఫరవాలేదు.

బంకించంద్ర్ ఛటోపాధ్యాయ్ స్నేహితుడు "దీనబంధుమిత్ర" మంచి చతురుడు. వినోద స్వభావం కలవాడు. ఆయన విసుర్లు బంకిం బాబు మీదకి కూడా వచ్చేవి.

ఒకసారి ఆఫీసు పనిమీద ఆయన "సిల్చర్" వెళ్ళాడు. అక్కడినుండి వచ్చేటప్పుడు బంకించంద్ర్ కొరకు ఒక చక్కటి చెప్పుల జత కొనుక్కొచ్చాడు.

కలకత్తా తిరిగి రాగానే, ఆ చెప్పుల ప్యాకెట్‌ను సేవకుడి చేతికిచ్చి పంపించాడు.దానివెంట ఒక ఉత్తరం వ్రాసి పంపాడు. అందులోఇలా ఉంది.

"కైమన్ జూతే? (చెప్పులెలా ఉన్నాయి?)

బంకించంద్ర్‌కు చెప్పులు నచ్చాయి. మిత్రుడు చిలిపితనం కూడా నచ్చింది. నేను పంపిన (నీమీద వేసిన) చెప్పులెలాగున్నా యనేది అతడి ప్రశ్న.

బంకించంద్ అదే సేవకుడితో జవాబు వ్రాసి పంపాడు. అందులో ఇలా ఉంది. "తోమార ముఖేరమతో" (నీమొహంలాగుంది)

వ్యంగ్యం హార్థికమై,ప్రేమయుతమూ తిరస్కారం కానంతవరకు ఫరవాలేదు. వ్యంగ్యం వ్యక్తిత్వాన్ని అవహేళన చేసేదిగా ఉండకూడదు.

> **మన మనస్సే మనకు పెట్టనికోట**
> **అది దెబ్బతింటే జీవిత సమరంలో మనం ఓడిపోతాము. – రాజాజీ**



## 15. అదృష్టానికి నోచుకోలేదా!

**"ఓ బ్రూటన్! ఇందులో మన భాగ్యం యొక్క తప్పేమీలేదు. మనలను మనం నికృష్టులుగా ఎంచే మనదే తప్పు" –షేక్స్పియర్**

మనం మన వెంట ఏం తీసుకువచ్చామో తెలియదుగానీ, పరమాత్మ మనకు ఆలోచించడానికి బుద్ధిని, కర్మ చేయడానికి కాళ్ళు, చేతులు ఇచ్చాడు. ఆలోచించండి. అర్థంచేసుకోండి, పనిచేయండి. అదేపురుషార్థం. మిమ్మల్ని మీరు తుచ్ఛులుగానూ, హీనులుగాను, నికృష్టులుగానూ అనుకోవద్దు. మీ శక్తిని అర్థంచేసుకోండి. పురుషులు పౌరుషాన్ని, సింహంగర్జనను మరచిపోతే అస్థిత్వమే సమాప్తంకాగలదు. ఒక్కసారి కండ్లు తెరచి చూడండి. మీలాంటి మనుషులే ప్రపంచ ఇతిహాసాన్ని మార్చేశారు. వారిని ప్రేరకులుగా, ఆదర్శంగా పెట్టుకొని ముందుకు నడవండి.

నెపోలియన్ బోనాపార్ట్ ఉత్సాహానికి చెలియలికట్టు ఉండేదికాదు. ఆయన నిరంతరం యుద్ధాలతో మునిగి యుండేవాడు. ఒకసారి ఇలానే యుద్ధం చేస్తూ ఆల్ఫ్స్ పర్వతాలను సమీపించాడు. ఆయన తనసేనతో ఆ పర్వతాలను దాటి వెళ్ళాలనుకున్నాడు.

ఈ పర్వతాల్లోని ఒక శిఖరంపైన ఒక వృద్ధ తపస్వి నివసిస్తూ ఉండేది దారి తెలుసుకోవడం కొరకు కొందరు సైనికాధికారులను వెంటపెట్టుకొని నెపోలియన్ ఆవిడ వద్దకు వచ్చాడు. ఆయన కోరిక విన్న ముసలమ్మ పకాపకా నవ్వింది. ఆవిడ ఈ విధంగా అంది. "నీలాంటి మూర్ఖులు చాలామంది ఈ పర్వతా రోహణచేస్తూ ప్రాణాలు విడిచారు. కనుక నువ్వు ఎలా వచ్చావో అలాగే వెళ్ళిపో"

ముసలమ్మ మాటవిని నెపోలియన్ నిరాశపడలేదు. అసంభవమనే శబ్దాన్ని శబ్దకోశంనుంచే తొలగించమనే ఆయన,ఆ వృద్ధస్త్రీతో ఇలా అన్నాడు. "మీ మాటలు నాకెంతో ఉత్సాహాన్ని ఇచ్చాయి. మార్గం దుర్గమమైంది. అన్నారు కనుక నేను మరికాస్త జాగరూకుడనై పర్వతాన్ని దాటడానికి ప్రయత్నిస్తాను. అంతేకాని వెనక్కు తిరిగే ప్రసక్తి మాత్రం లేదు."

ఆ వృద్ధనారి నెపోలియన్ యొక్క అచంచల విశ్వాసానికి ముగ్ధురాలై "మీలాంటి సాహసికి ఈ ప్రపంచంలో అసంభవమైన పని ఏదీలేదు. వెళ్ళు నీ కార్యంలో నీవు విజయం పొందాలని ఆశీర్వదిస్తున్నాను" అన్నది.

తన దృఢ నిశ్చయానికి, ఆ తపస్విని ఆశీర్వాదాన్ని జోడించి నెపోలియన్ సేనతో సహా ఆ పర్వతాన్ని దాటివెళ్ళాడు.

ప్రకృతి మనకు బుద్ధినిచ్చింది. చేతనత్వాన్నిచ్చింది. నిర్ణయించగల శక్తినిచ్చింది. వెనువెంట పనిచేయగల క్షమతను కూడా ఇచ్చింది. అయినా ఇంకా నా అదృష్టం బాగాలేదంటారెందుకు? అదృష్టం అంటే ఏమిటి? ఇప్పుడు కనపడ నిది. ఏనాడో చేసుకున్నదీ ఇప్పుడు ఫలవవంతం కావడమేకదా, మరి ఇప్పుడు తినడానికి పండ్లు లేవని విచారించేకన్నా ఇప్పుడే బీజాలెందుకునాటవు? కనుక భాగ్య నిర్మాతవు కూడా నీవేనని గ్రహించు. ప్రపంచ ఇతిహాసాన్ని అదృష్టం వ్రాయలేదు. నీ ప్రగతిని అదృష్టం నిర్ణయించదు. ఆవిష్కరణ (క్రొత్తవి కనుక్కోవడం) పరిశ్రమవల్ల సాధ్యమైందికాని అదృష్టంవల్ల కాదు. ఈ సంసారంలోని వైభవం, అభివృద్ధి చెందిన దేశాల యొక్క సంపద నిరంతర పరిశ్రమవల్ల వచ్చిందేకాని అదృష్టంవల్ల వచ్చింది కాదు.

**"నాయ మాత్మా బలహీనే నలభ్యః"** - భౌతిక ప్రగతిని అలా ఉంచండి. ఆఖరికి ఆత్మ సాక్షాత్కారం కూడ నిర్బలుడికి కలగదంటున్నది ఉపనిషత్తు. కాలిమీద కాలేసుకొని కూర్చోవడం వల్ల ఎవడి కడుపు నిండింది? విజయం భాగ్యం వల్లకాదు! శక్తియుక్తి, వ్యవస్థలపై ఆధారపడి ఉంటుంది.

తులసీ రామాయణంలో సముద్రాన్ని దాటడం ఎలాగ అనే ప్రశ్న వచ్చినప్పుడు అందరూ సలహాలిస్తారు. విభీషణుడి సలహా మేరకు శ్రీరామచంద్రుడు సముద్రుడిని ప్రార్థించడానికి ఉద్యుక్తుడౌతుండగా, లక్ష్మణుడు ముందుకువచ్చి ఇలా అంటాడు. "దైవదైవ ఆలసీపుకారా" దేవుడూ-దేవుడూ అని బద్ధకస్తుడే పిలుస్తూ ఏపనీ చేయకుండా కూర్చుంటాడు. ఓ మహాబలా! ఆజానుబాహూ! ప్రార్థనలతో జాప్యం చేయకండి. మీ భుజబలంతో కార్యం సిద్ధింపచేయండి"

జీవితంలో అనేకసార్లు అవకాశాలు వచ్చి తలుపు తడుతూ ఉంటాయి. అప్పుడు మనం బద్ధకంగా నిద్రిస్తూనన్నా ఉండి ఉంటాము లేదా క్లబ్బుకెళ్ళి పేకాడుతూనన్నా ఉంటాము. అదృష్టాన్ని నమ్ముకొని కూర్చోకండి. ఒకసారి వచ్చిన అవకాశం మళ్ళీ రమ్మన్నా తిరిగిరాదు. మనయొక్క ఉన్నతి వికాసం అనే ద్వారం తెరవడానికి మనం ఏనాడూ ప్రయత్నించలేదు.

ప్రయత్న మెక్కడుందో అక్కడే విజయం కూడా ఉంది.

**ఆగ్రహం సాధారణంగా బుద్ధిహీనతతో ప్రారంభమై పశ్చాత్తాపంతో అంతమౌతుంది. - పైథాగరస్.**



## 16. గమ్యాన్ని మార్చకండి

**"ధనహీనమైనదైనా స్వధర్మమే ఉత్తమం"**

**- గీతాచార్యుడు**

వ్యక్తి తన గమ్యాన్ని అయితే భయం వల్ల లేదా లోభం వల్ల మార్చు కుంటాడు. ఈ రెంటికీ లొంగకుండా ముందుకు సాగినవాడే విజయాన్ని పొంద గలడు. ఏదో ఒక కారణంవల్ల ప్రతి క్షణం గమ్యాన్ని మార్చేవాడు ఢిల్లీకి వెళదామని రైలు ఎక్కి మళ్ళీ రెండు స్టేషన్‌ల తరువాత దిగి బొంబాయి రైలు ఎక్కినట్టుగా ఉంటుంది. ఇలా రైళ్ళు మార్చడంలోనే జీవితమంతా గడచిపోయి అసలు ఏ గమ్యమూ చేరలేకపోవచ్చు.

శ్రీమతిరుక్మిణీ అరుండెల్ నృత్య, సంగీతాదికళలలో వైదుష్యమున్న ఒక గొప్ప కళాకారిణి. దేశ కళా సంస్కృతిక పునర్జాగరణ కొరకు 'తిరువన్ మియార్‌లో దాదాపు వంద ఎకరాల స్థలంతీసుకొని అందులో కళాక్షేత్రం అనే ఒక సంస్థను స్థాపించింది. అక్కడ ఇప్పటికీ యోగ్యులైన గురువుల ద్వారా విద్యార్థీవిద్యార్థినులకు నృత్య, సంగీతాది (గాత్ర, వాద్య) చిత్రకళలలో శిక్షణ ఇవ్వబడుతున్నది.

1977లో ఆవిడ తన కళా సమాజంతోబాటు భారతీయ నృత్య ప్రదర్శన లివ్వడానికి హాలెండ్ వెళ్ళింది. ఒకరోజు ఉదయం ఆవిడ విడిదిచేసిన హోటల్ గదిలో ఫోన్ గంట మ్రోగింది. ఆపరేటర్ ఆవిడతో భారత ప్రధానమంత్రి మొరార్జీ దేశాయ్ ఆవిడతో మాట్లాడబోతున్నట్లుగా చెప్పింది.

మొరార్జీదేశాయ్ ఆవిడతో భారత రాష్ట్రపతి పదవి స్వీకరించమని కోరాడు. ఒక్క క్షణం ఆవిడను స్తబ్దత ఆక్రమించుకున్నది. కాసేపు ఆవిడ ఏమీ మాట్లాడలేకపోయింది. "ఏమిటీ రాష్ట్రపతి పదవా"? అనిమాత్రం అన గలిగింది మళ్ళీ తమాయించుకొని "నేను ఆ పదవి గురించి ఏమీ ఎరుగనే?" అన్నది.

మొరార్జీదేశాయ్ ఆవిడకు ధైర్యం చెబుతూ "ఫరవాలేదు మీరే తెలుసుకోగలరు. ప్రస్తుతం మీరు మీ కార్యక్రమాలన్నీ రద్దు చేసుకొని భారతదేశానికి తిరిగిరండి" అన్నాడు.

"మీరు చెబుతున్నారు కనుక అలాగే రావడానికి ప్రయత్నిస్తాను" అన్నది. శ్రీమతి అరుండెల్ అదురుతున్న గుండెలను చిక్కబట్టుకొని.

ఆ రాత్రి ఆవిడకు నిద్రపట్టలేదు. "నేను అంత శ్రేష్ఠమైన పదవికి అర్హురాలినేనా? నేనీ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించగలనా? ఒకవేళ నేను ఆ పనిని సరిగ్గా చేయగలిగినా మరి నా కళాక్షేత్రం ఏమవుతుంది?" ఈ విధంగా ఆలోచిస్తూ రాత్రంతా గడిపింది. తెల్లవారుజామున ఒక చిన్న కునుకు తీసిలేచింది. ఆవిడ మనస్సు ఇప్పుడు స్థిరమైంది. తన జీవిత గమ్యం కళేనని నిర్ణయించుకుంది.

ఉదయం ఫోన్‌లో మొరార్జీ దేశాయ్‌తో వినమ్రంగా "నేను రాష్ట్రపతి పదవిని స్వీకరించి నిర్వహించడానికి అసమర్ధురాలను" అని తన నిర్ణయం చెప్పివేసింది.

మొరార్జీదేశాయ్ ఆవిడకు ఎంతో నచ్చచెప్పచూశాడు. రాజకీయాలకు దూరంగా కళకు సమర్పితమై విశ్వవిఖ్యాతిగాంచిన ఆవిడను అందరూ రాష్ట్రపతిగా స్వీకరిస్తారని తానుకూడా ఆ పదవికి న్యాయం చేకూర్చగలదని చెప్పాడు.



ఎన్నిసార్లు చెప్పినా ఆవిడ మాత్రం స్వీకరించలేదు.

చివరికి ఓటమి నొప్పుకున్న మొరార్జీదేశాయ్ "మీకు నిజంగా నా ప్రస్తావన స్వీకారం కాకపోతే అదే విషయం స్పష్టంగా తెలియజేస్తూ ఒక టెలిగ్రామ్ ఇవ్వవలసింది" అన్నాడు.

శ్రీమతి అరండేల్ వెంటనే టెలిగ్రామ్ పంపింది. రెండవ రోజు దేశ విదేశాలలోని అసంఖ్యాకమైన పత్రికలు కళాక్షేత్రంపై ఆవిడకు గల సమర్పణను, ఇంత గొప్ప పదవిని కాదనగలిగిన ఆవిడ త్యాగబుద్ధిని కొనియాడుతూ వ్రాశాయి. ఆ తరువాత ఆవిడ కళకే పూర్తిగా సమర్పితమైంది

**సాధారణంగా గొప్పవాళ్ళు ఆ గొప్పతనాన్ని కేవలం తమ తెలివితేటలతోనే కాకుండా నిరంతర పరిశ్రమవల్ల పొందుతారు.**

**– బ్రూస్ బార్టన్**



## 17. కోరుకున్నదే లభిస్తుంది

నీవే నీకు మిత్రుడివి. నీవే నీకు శత్రువువు కూడా. ఈ ప్రపంచంలో నువ్వు సాధించదలచుకొన్న దాని కొరకు ప్రయత్నిస్తుండగా దానికి అడ్డుపడుతున్నది కూడా నువ్వే. నీ ప్రయత్నానికి సహాయం కూడా నీనుండే లభిస్తుంది. నీవే నీ స్వర్గానికి నరకానికి మార్గదర్శివి. నువ్వు ఏది కోరుకుంటావు అనేది నీ చేతిలో ఉంది. నిర్ణయం నీది. నీవు సర్వస్వతంత్రుడివి.

ఒకవేళ నువ్వు నరకాన్ని, దుఃఖాన్ని, అపజయాన్ని కోరుకున్నావా ఇక ఇతరులకు దోషం అంటగట్టవద్దు. నేను ఇది కోరుకున్నాను అనేది స్మరణలో ఉంచుకో. ఏది కోరుకుంటావో అదే లభిస్తుంది.

ఈ ప్రపంచంలో అడగనిది ఏదీ దొరకదు. కాని కోరికకు వస్తూపలబ్ధికి మధ్య కొన్ని సంవత్సరాల దూరం ఉండవచ్చు. లేక కొన్ని జన్మల తరువాతే లభించవచ్చు. కానీ ఎప్పుడైనా ఏదైనా లభిస్తే తప్పక ఎప్పుడో కోరికలనే బీజాలు నాటాననీ, పంట ఇప్పుడు కోసుకుంటున్నాననీ గ్రహించు. ఎప్పుడు కోరుకున్నావనేది నీకు స్మరణకు రాకపోయినా పంట ఈరోజు అందటమే ఒకప్పుడు బీజం పడిందనటానికి ప్రమాణం. కనుక నీ జీవిత యాత్రను నీవు ఎప్పుడైనా మలుపు త్రిప్పుకోవచ్చు. నీవు వెళుతున్న మార్గం తప్పని నీకు తెలిస్తే, మార్చుకోవటం నీ చేతులలో ఉంది. తప్పక మార్చుకోవాలి కూడా.

ఈ సృష్టిలో సంతోషం నీ కెవ్వడూ అందించడు. నీవు సంతోషంగా ఉండదలిస్తే ఉండటమే. జాగ్రత్తగా వీక్షించు. నిజానికి నీకు ఇప్పటివరకు లభించింది నీ యొక్క అవసరాలకు మించేఉంది. అనాదికాలంనుంచి నీవు కోరింది నీకు లభిస్తూనే వచ్చింది! నీ కొరకే నీ జీవితాన్ని రచించింది. కాని ఇది మనకు సత్యం అనిపించదు. నేను కోరుకోనిది నాకు లభించిందనిపిస్తుంది. దుఃఖం కావాలని, విఫలత కావాలని ఎవడూ కోరుకోడు. కాని ఎంతోమంది దాన్ని పొందుతుండటము చూస్తాము. ఐతే నీ కోరికను మాటలలో పెట్టటంలో పొరపాటు చేసి వుంటావు.

విఫలత కారణంగానే, నువ్వు సఫలతను కోరుకుంటున్నావు. కనుక ఎప్పుడెప్పుడు నువ్వు విజయం కోరుకుంటే అప్పుడప్పుడు విఫలత యొక్క స్మరణ కలుగుతుంది. ఈ విధంగా అపజయం యొక్క ఆలోచనే మనస్సులో బలంగా తయారవుతూ ఉంటుంది. విజయం మార్గంలో కొన్ని మజిలీలెదురౌతాయి. అక్కడ కొంత విశ్రమించి విజయం అనే గమ్యానికి చేరక, ఆ మజిలీనే అపజయంగా

భావించి, నిరాశతో చాలామంది వెనక్కు వెళతారు. పైగా విఫలత వస్తుందేమోనన్న భయంతో దాని స్మరణే పెరిగి చివరికి అదే ప్రకటమౌతుంది. అప్పుడు నువ్వంటావు. నేను విజయం కోరుకున్నాను. కానీ అపజయం లభించింది. కాని జరిగింది వ్యతిరేకం. నీవు అపజయం నీకు తెలియకుండానే కోరుకున్నావు.

**లాఓత్స్ అనే మహానుభావుడంటాడు :–** విజయం కోరుకుంటే అపజయం లభిస్తుంది. కనుక నీకు నిజంగా విజయాన్ని కావాలంటే విజయాన్ని కాంక్షించకు. ఇక నిన్నెవడు విఫలుణ్ని చేయలేడు. "నేను సన్మానం కోరుకున్నాను కాని అవమానం లభించింది"అని నువ్వంటావు. తనపై తనకు సద్భావం లేనివాడే ఇతరుల నుండి గౌరవం కోరుకుంటాడు. తనలోని లోపాలను కప్పిపుచ్చుకోవటా నికి, ఇతరులు తనను గౌరవించాలని, సన్మానించాలని కోరుకుంటారు. తనలోని న్యూనతా భావాన్ని ఇతరులు చేసే సన్మానాలతో కప్పిపుచ్చుకుందామని ప్రయత్ని స్తాడు. తనయొక్క స్థానం స్థాయి తెలిసినవాడు ఇతరులు తనను సింహాసనంపై కూర్చోబెట్టాలని ఆశించడు. ఆ విధంగా తనను తాను అవమానించుకోడు.

'లాఓత్స్' అంటాడు – నన్ను ఎవ్వరు అవమానించలేరు. ఎందుకంటే నేను అసలు సన్మానాలు ఆశించను. ఇదే సన్మానాలు పొందే విధానం.

"నన్ను ఎవరూ ఓడించలేదు. ఎందుకంటే విజయం యొక్క ఆలోచనే నేను విడిచిపెట్టాను. ఇక ఏ విధంగా ఓడించగలవు?"విజయం కోరుకున్నవాడినే నీవు అపజయంపాలు చేయగలవు.

ఈ ప్రపంచంలో సన్మానం కోరుకోనివారికే సన్మాన లభిస్తుంది. విజయం కూడా విజయం కోరుకోనివారికే లభిస్తుంది. ఎవరైతే తాము ముందే విజయమని ఎరుగుదురో ఇక వారేవిధంగా ఇక విజయం ఆశిస్తారు? స్వయం పరమాత్మే మనను మానవులుగా పుట్టించి గౌరవం ఇచ్చాడు. సన్మానించాడు. ఈదుర్లభ యోనితో చక్కటి జీవనమిచ్చాడు. సౌభాగ్యమిచ్చాడు. ఆయన నుండి విజయం పొందింది అన్ని ప్రాణులలోనూ ఒక్క మనిషి మాత్రమే. మధురమైన ఈ ప్రకృతి సౌందర్యాన్ని ఆయనిచ్చిన కండ్లతో చూసి విజయులుకండి. సెలయేటి గలగలలు కండి! గామారండి! పనికిరాని చిన్నచిన్న విషయాలలో విజయం కోసం బిచ్చగాళ్ళలాగా చేతులు చాచకండి!!

> **శ్రమద్వారానే ఆరోగ్యదాయకమైన ఆలోచనలు కలుగుతాయి; ఆలోచించి చేసేపని ద్వారానే శ్రమ ఆనందదాయకమౌతుంది. శ్రమనూ, ఆలోచననూ విడదీయడం శ్రేయస్కరం కాదు. – రస్కిన్**



## 18. మీ వెంట వస్తుంది సన్మానం

సన్మానాల వెంట పరిగెత్తకండి. మీలో అర్హత ఉంటే అవే మీవెంటపడి రాగలవు. దీపం చుట్టూ పురుగులు చేరతాయిగానీ, దీపం వాటికొరకు పరిగెత్తదు. నిప్పురవ్వను దాచిపెట్టలేము. కొంగున ముడివేద్దామని చూస్తే అది కాల్చుకునైనా బైటపడుతుంది. మీలో అర్హత లేనప్పుడు సన్మానాల కొరకు ఎగబడితే ఆపహాస్యమే ఎదురౌతుంది. పైగా సన్మానాలలోనే విజయం ఉన్నదనుకోకండి. ఆత్మ తృప్తిలోనే విజయం ఉన్నది.

ప్రసిద్ధ కళాగురువు **"జామినీరాయ్"** యొక్క ఖ్యాతి దశదిశలా వ్యాపిస్తున్నా ఆయన పటాటోపాన్ని, సన్మానాలను ఇష్టపడే వాడుకాడు. ఆయన ఏదైనా మీటింగులో గాని, గోష్టిలోగాని పాల్గొనగా ఎవరూ చూడలేదు. ఆయన సమకాలీనులైతే ఆయన కలకత్తా విడిచి బైటకి వెళ్ళడం మేము చూడలేదనేవారు. విదేశీయుడైన భారతీయ కళాప్రేమి **"ఆస్టిన్‌కోట్స్"** యొక్క డైరీకూడా ఇందుకు ప్రమాణాన్నిస్తుంది. అందులో ఆయన ఇలా వ్రాశారు....

"ఒకరోజు నేను జామినీరాయ్ ఇంటికి వెళ్ళాను. ఆయన నాకు ఢిల్లీకి రానుపోనూ రిజర్వ్ అయివున్న ఫస్టుక్లాస్ రైల్‌టికెట్ తీసి చూపారు. అది సెంట్రల్ గవర్నమెంట్ తరుపున జరగబోయే సన్మానానికి ముందుగావారే చేసిన ఏర్పాటు.

"ఐతే మీరు వెళతారా"? అని నేను అడిగాను. ఆయన నవ్వుతూ లేదన్నట్లుగా తల ఊపారు. "కానీ ఎందుకు?" అని మళ్ళీ నేనడిగాను అందుకు ఆయనన్నారు. "ఆ సన్మానమేదో ఇక్కడికే పంపవచ్చు కదా?" అన్నారు. అలాగే జరిగింది కూడా.

> **మనుష్యులను జయించడానికి శక్తియుక్తులు చాలవు. మహో దాత్తమైన మనస్సు, ప్రేమపాశం అవసరం.**
> **– స్పినోజీ**

